మ. ధరకౌండిన్యసగోత్రమందలరుచున్ దాతృత్వధర్మంబులన్
సరిసుండై హితబంధుబృందములకున్ సాహాయ్యముం జేయుచున్
వరపౌరాణము జెప్ప [illegible]కగనె నాప్రాజ్ఞుమ్మనీయాగ్రజున్
స్థిరత[illegible]ల్చెద [illegible]హ్వాయుని సచ్ఛ్రియంబులన్ బొందగన్

మ. [illegible]బుజ్జేసి యె[illegible]ంగ బాల్యమున సాహాయ్యంబునన్ [illegible]ందనే
[illegible]టిమంబున్గన విద్యలందు ధరసంప్రాప్తించరే గుర్వాళిం
తటికార్యంబుల పూన్కి జేసితిని సందర్భంబులన్ గ్రంధిపేం
కటసుబ్బాబహ్వాయ గుప్తనామమిల సంకాశంబునన్ దాల్చెడిన్

మ. చలనం బెంతయు లేకచిత్తమున భాషాసేవకై బూని వై
శ్యులలో నున్నతమౌయశంబుగొన సంశోభిల్లుగ్రంధాళి వే
డ్కలరారన్ దగ ముద్రణంబునకు వహ్వాబూనె నెన్నాడు కం
దుల గోవిందము యీశుదాతనికి సంతోషంబునన్ సార్చెడిన్.

శా. శోపానత్రయి మొప్పి రమ్యముగ సంశోధించుచు న్వ్యాఖ్యలన్
దీపించు న్గురుయాంధ్రదేశమున సద్గేహంబు లన్నింట వి
ద్యాపారీణులు సంతసంబలర సైయించున్ మనుత్మేచ్ఛన్
కాపాడంగను వైద్యుడౌ గృహము లీగ్రంథంబు ధాత్రిస్థలిన్.

చం. దనరకషాయ వర్గముల ద్రవ్యగుణంబుల దీప్తిమించుచున్
ఘనతరచూర్ణలేహ్యములు కాంచనవిద్రుమ లోహభస్మముల్
గొనముల బట్టుబట్టిడగు కుప్పెలొనర్చు విధాన మొప్పనున్
యనుభవగృహ వైద్యము సహర్నిశమున్ యశసంచు గాంచెడిన్.

గీ. శోధనము జేసి ననముస సుగుము మొప్ప
వ్యాసిగ్నించి వేగిర పాటులేక
బాగుకొలంగ జేసిన వైద్యుడెలమి
సాగకుండదగు దేవ్రకు సంతసించు.

గృహవైద్య మనగా యింటిలోనుండువారు ముందు ఆహారవస్తువులయొక్క గుణము దెలిసికొని వ్యాధులుపుట్టక నుండునటుల జాగ్రతగలిగి వర్తింపవలయును. రోగములు బుట్టుటకు తినుబండారపువస్తువులయొక్క గుణమే ప్రాధాన్యము. భుజించు పదార్థములు దోషరహితములుగా నుండియుండిన ఆరోగ్యముగలిగియుందురనుటకు సందియము లేదు. రుగ్మత గలుగుటకు అజీర్ణము ముఖ్యకారణము. జీర్ణకోశము బాగుగా కాపాడుకొనుచుండిన నిరామయులై సౌఖ్యముగా నుందురు. అజీర్ణముచేసినటుల గనుపించిన ఉపవసించి జఠరాగ్నిని బాగుపరచుటకంటె మేలైన చికిత్స మరియొకటి కనుపించదు. పసిబిడ్డలకు అజీర్ణము జేసినపుడు పాలు నియమితముగా గుడుపుచు తల్లి జఠరాగ్నిని వృద్ధిజేసికోవలయును. సంవత్సరమున కొకటి రెండు పర్యాయములు సుఖతరమైన విరేచనములకు దీసికొనిన అన్నకోశము పరిశుభ్రమగును. ఆముదమును రెండుమిరపకాయలు వైచి గాచి చారులో మిశ్రిమ మొనర్చిగాని లేక అల్లముయొక్క స్వరసములో జేర్చి తేనె మిశ్రిమము జేసిగాని త్రాగిన మిగుల సుఖతరముగా విరేచనములగును. తేనె జేర్చు యెడల ఆముదము బాగుగా చల్లార్చి కలుపవలయును. వేడియున్న యెడల తేనె గలుపకూడదు. ప్రాణాపాయము గలిగించును. అల్లము రసముతెచ్చి అడుగున తేరిన తెల్లని పదార్థము (సున్నము) నువిడువవలయును. అల్లము సత్తు (సున్నము)

తీయక ఉపయోగించిన ప్రాణముదీయును. విషతుల్యము. ఈ విషయములు యిం[illegible]వారు జ్ఞప్తియందుంచుకొన వలయును. మనము [illegible]త్యముభు[illegible] ఆహారవస్తువులయొక్క గుణముల గ్రహించు[illegible] ముఖ్య[illegible]ముగాన వాటిని యిచ్చట దెలిపి పిమ్మట జ్వర[illegible]దిరోగముల చికిత్సలు వివరింపబడును.

## —♦ ధాన్యము. ♦—

ధాన్యములలో పిన్నకుసుమ పెద్దకుసుమ రామసాగ రాలు ఢిల్లీభోగములు మొదలగునవి యనేకరకములు గలవు. అటులనేజొన్నలలోనుగలవు. పెద్దజొన్న పితపజొన్న తెల్లజొన్న యెఱ్రజొన్న మొదలగునవి కలవు. ఇంక రెండు నెలలు మూడు నెలలు ఆరుమాసములకు ఫలించునవికలవు. కొన్ని పైత్యకర ములు. కొన్ని ఉష్ణకరములు. భూమికివ్వబడు ఎరువులబట్టికూడా ధాన్యాములకు గుణములు గలుగుచుండును. ఇవి అనుభవము మీాద మనకు తెలియుచున్నవి. పందిపెంట యెరువుగా నుప యోగించి పండించుధాన్యము మిక్కిలి యుష్ణముగలిగించుటయె గాక మిగుల అనారోగ్యము కలిగించుచున్నది. ఇదిగాక వరిపైరు కోసినపిమ్మట ఆభూములలో జనుము వైచుచున్నారు. అట్టిభూ ములందు పండించుధాన్యములు కూడా దుర్గుణముల బుట్టించు చున్నవని అనుభవజ్ఞులు చెప్పుచున్నారు. పశువులకు వైచునట్టి ఆహారమునుబట్టియె పాలయొక్కగుణము మారుచున్నది. పశు వులు అడవులలో యిష్టమువచ్చిన కసవుమేసి చెట్లయొక్క

ఆకుల భక్షించి క్షీరములొసంగిన పరిశుభ్రముగాను ఆరోగ్య కరముగాను యుండును. గృహమునందు గట్టివైచి కొబ్బరిచెక్క తవుడు మొదలగునవి వైచి పాలు బ్రితికకొనిన నిస్సారములు గానుండును. చెన్నపట్టణమందు బ్రితుకు యావుపాలగుణము బరీక్షించిన మనకు తెలియగలదు. పాలయొక్క గుణమే రుచిం చదు. ధాన్యాదులను మనపూర్వులు భూపుటము (పాతర) వేయనిది ఉపయోగించువారుకారు. ఇప్పుడు పాతకొట్టివో యెరుంగరు. కొట్లలోపోయుచున్నారు. భూపుటమువలన ధాన్యాదుల దుర్గుణములు దొలంగును. సామాన్యముగా నిప్పటికి బాలింతరాండ్రకు పాతరబడ్డ ధాన్యపుబియ్యమే వాడుటకలదు. వంటపాత్రలలో దోషాదోషములు బుట్టుచున్నవి. పాకమునకు మట్టికుండలే (మృణ్మయపాత్రలు) శ్రేష్ఠము. మృత్తికాపాత్రలు ధాన్యాదుల దోషములు కొంతవరకు బాపగలవు. ఇప్పుడవి మోటుఅయినవి. ఇత్తడిపాత్రలు రాతి వెండి (జర్మనుసిల్వరు) మొదలగు పాత్రలు వాడుచున్నారు. ధనికుల యిండ్లలో క్షీరములుకూడా ఇత్తడిపాత్రలలో గాయుచున్నారు. ఇవియే రోగములు బుట్టించుటకు కారణములని జెప్పవచ్చును. సాధారణముగా వైద్యులిప్పటికిని కషాయాదుల మృత్తికాపాత్రలలో గాయించుట మీరుగనుగొనుచునే యున్నారు. ఉదకపానమునకు రాగిపాత్ర లుపయోగించుటకు మిగులమంచిది.

-----

## —♦ ధాన్యవిశేషముల గుణము ♦—

ఎఱ్ఱరాజనాలు—ఇవి ధాన్యములలో శ్రేష్ఠమైనవి. వాతపిత్తకఫముల హరించును. వ్రణముల హరించును. జ్వరముల హరింపజేసి బలమొసంగును. శుక్లవృద్ధిగలిగించును.

తెల్లరాజనాలు—నల్లరాజనాలు—ఇవి కొంచెముతక్కువగ ఎఱ్ఱరాజనాల గుణము కలిగియుండును. ఈ ప్రాంతమందు ఎలవడాలు బుడమ (జిలమ) వడ్లుగలవు. ఇవి యెందులజేరునో యిప్పటి కనుభవములేదు. ఎలవడాలు పైపొట్టు తెల్లగానుండి లోపలబియ్యము కొంచెము ఎఱ్ఱగానుండును. ఇవి మేహశాంతిని గలిగించును. స్త్రీలకు కుసుమరోగము (వీరెలు విడచుట) లందు ఎలవడపు బియ్యపుతవుడు శర్కరగలపి యొసంగిన నివారించుటకలదు. ఇక బుడమవడ్లు పైపొట్టు కొంచమునల్లగానుండి లోపలిబియ్యము యెఱ్ఱగానుండును. ఇవి పైత్యాజీర్ణములు గలిగించును. నివారిధాన్యము శీతలముగను మలబద్ధకరముగనుండును. వాతకఫముల బుట్టించును. పైత్యము నడంచును. క్రొత్తధాన్యములు శ్లేష్మమునుబుట్టించును. ప్రాతవిషఘ్నకరము. సంవత్సరమునకు పైబడినవి లఘువు (తేలిక) గానుండును.

జొన్నలు—(యావనాలు) రుచికరముగను మలబద్ధకరముగను రూక్షగనుండును. వీర్యమును బెంచును. రక్తవికారము బోనడంచి హృదయమునకు మేలొసంగును. శ్లేష్మపైత్యముల హరింపజేయును. తెల్లజొన్నలు గిడ్డజొన్నలు ఎఱ్ఱజొన్నలు

(పాలాపుజొన్నలు) మొదలగునవి పైత్యకరములని తెలియ వచ్చుచున్నది.

వెదురుబియ్యము—రూక్షగను కషాయముగను కారముగను మూత్రబద్ధకరముగను వాతపిత్తముల జేయునవిగా నుండును. కఫముహరించును. యవలు (గోధుమజాతిలోనివి) పైత్యకఫ రక్తదోషముల హరింపజేయును. అగ్నిదీపనము బుద్ధి స్వరమును వృద్ధినొనర్చును, మేహ దాహము లణంచును. వ్రణములయందు పథ్యము వాతమును వృద్ధిగావించును. చిక్కినవారిని స్థూలమొనరించును

గోధుమలు—ధాతుపుష్టి బలము కలిగించును. శరీర వృద్ధిని గావించును. వాతము పైత్యము మూత్ర దోషము వీటిని నివర్తింపజేయును. గురువుగా నుండును. గోధుమరొట్టెలరాత్రి భుజించుట యుత్తమము బాలురా విరేచనము గావించును. దేహమునకు పుష్టిబలమొసగును. ఇవి సర్వవ్యాధులకును పథ్యకరము. రొట్టెలకంటె గోధుమహాన్నము తేలికగా జీర్ణమగును జ్వరితులకు గోధుమజావ మిగులహితకరము.

వరిగెలు—(వరకో మధురో రూక్షః కషాయో వాతపిత్తకృత్) మధురముగను రూక్షగను కషాయముగానుండును. వాతపిత్తముల కలిగించును.

ఆళ్ళు—(కోద్రవః) మూత్రరోగము వాతము శ్వాస వీటినడంచి అగ్నిదీప్తి నొనరించును.

## కంగ్వాది తృణ ధాన్యములు

కంగు—(కొఱ్ఱలు) కోద్రవము (వరిగెలు) నీవార (నివ్వరివడ్లు) శ్యామాకము (చామలు) శిబిరము ప్రశాంతికము మధూళికము గవేధుకము (అడవిగోధుమలు) కాండలోహితము యివి తృణధాన్యములు లఘువుగానుండును. వాతమును గలిగించును. మలమూత్రబంధకములు వాతపైత్యముల హరింపజేసును. కొఱ్ఱలు విరిగినయంగముల నొకటిగా జేర్చును. పుష్టి నిచ్చును. కఫమును హరింపజేయును. గుర్రమునకు మొనరించును. లంఘనము లుంచినపుడు కొఱ్ఱసారకమును జేయుంతురు. అనగా కొఱ్ఱజావను త్రాగింతురు. ఇందు కొఱ్ఱ నాత భేదము లేదు.

ఆళ్లు—మలమును బాధించును. విషమును హరింపజేసును.

## శింబీ ధాన్యములు

పెసలు కందులు చిరుసెనగలు యీ మొదలగునవి శింబీధాన్యము లనబడును. మలబద్ధమును గాహించును లఘువుగానుండును. రక్తపైత్యము మేదస్సు శ్లేష్మము వీనికి హితకరములు.

పెసలు—స్వల్పముగా వాతము నొనరించును. పిల్లిపెసలు శ్రేష్ఠతమము. ఇందు నల్లపెసలు పచ్చపెసలుగలవు.

పసుపుపచ్చపెసలు సోలాపూరు పండారీపురం మొదలగుచోట్ల గలవు. పెసలు పైత్యతాపము అతిసారము ప్రమేహము రక్తపైత్యము వీటిని నివర్తింపజేయును. పెసరపప్పుకట్టు పథ్యకారి.

కందులు—ఇవి తెలుపు యెరుపు రంగులుండును. పైత్యము గ్రహణమూత్రకృచ్ఛము వాతము వ్రణములు అతిమూత్రము వీటిని బోగొట్టును. తెల్లకందులు అపథ్యకరము. కడుపుబ్బరము మలబద్ధకము. వాతపిత్తముల జనింపజేయును. కందిపప్పు నీటిలో జేర్చి కాచి దానిలో తాలింపుబెట్టి పథ్యకారుల కుపయోగింతురు, దీని కందికట్టుయందురు.

మినుములు—గురుత్వముగను శీతలముగ నుండును. శ్లేష్మవాతముల గలిగించును. శరీరపుష్టి శుక్ల వృద్ధిగావించును. క్షయరోగము హరింపజేయును. మినపగారెలు మేహమునడంచి బలమొసంగును. మినపఆవిరికుడుము బలమొసంగును. అజీర్ణముగావించును. మినుములు వేయించి విసరిపిండిజేసితాటిబెల్లము ఆవునెయ్యికలపి భుజించిన దారుణమునడంచి శరీరపుష్టి వీర్యవృద్ధినొసరించును. పూర్వము మనుగుడుపులందు మినపసున్నుండల బెట్టుట యాచారము మిగులహితకరము. ఇప్పుడవి మోటు అయినవి.

ఉలవలు—ఉడకబెట్టినవి (గుగ్గిళ్లు) కారముగను కషాయముగను రక్తపైత్యమును బుట్టించునవిగను దాహమును

బుట్టించునవిగను ఉష్ణవీర్యకరముగను యుండును. శ్వాసకాస కఫము హిక్క అశ్మరి దాహము పీనసచమటజ్వరము క్రిమి వీనిని బోగొట్టును. ఉలవకషాయమును జ్వరితులకు దారకము గా నుపయోగింతురు. ఉలవలంకో నల్లేరుకాడలజేర్చి రుబ్బి వడి యములబెట్టుదురు. ఇవి నంజులందు మిగుల పథ్యకరము.

శనగలు—ఇవి రక్తపైత్యమును దొలగించును కఫము నుబోగొట్టును. మలబద్ధకము. వాతముగావించును. కుష్ఠువును శాంతిపరచును. అపానవాయువును బుట్టించును. వేయించినశన గలు శరీరకాంతి బలముగలిగించి వీర్యమును వృద్ధినొనరించును.

అలచందలు—(బొబ్బర్లు). గురుత్వము మలాభివృద్ధి గావించును. కఫమునణచి రుచిని బుట్టించును. పైత్యమునొన రించును.

అనుములు—జ్వరమునుబుట్టించును. శుక్లనష్టము గావిం చును. కఫవాతపైత్యముల బెంచును. మూత్రపురీషము లొన రించును. దగ్గులకు మేలునిచ్చును. వాంతి నేత్రరోగము శోష యివి మాన్పును. దాహమును బుట్టించును.

లంకలు—యివి నైజాము మొదలగు ప్రదేశములలో గలవు. వీనిపప్పు శనగపప్పుతుల్యముగానుండును. వీటిపిండి పిండివంటల కుపయోగించును. వాతము గురుత్వముగావించును. రక్తపైత్యము జ్వరమునణచును.

పెసరకట్టుగాచు విధము—అర్ధాఢక ప్రమాణముగల నీటిలో రెండు ఫలముల పెసరపప్పు జేర్చి నాలగవభాగము

మిగులునటుల గాచి గిలకొట్టి వడియగట్టుకొని దానిమ్మపండు సైంధవలవణము శొంఠి ధనియాలు వీనిచూర్ణము కాలు కర్షపరిమాణముగను పిప్పళ్ళు జీలకర్ర యివి శాణపరిమాణము లుగను గలపి సిద్ధము జేయవలయును. పథ్యకారి.

అన్నము—బియ్యము చక్కగా కడిగివండిన యన్నము మిక్కిలిశ్రేష్ఠము. చిత్రమూలము శొంఠి వీని తేలికషాయముల తో పచనము గావించిన యన్నము వాతాతులనణంచును. త్వరగా జీర్ణమగును. బియ్యము కొద్దిగా వేయించి వండిన యన్నము (దీనినే సొజ్జయందురు. ఉపవాసములందు కొందరుపయోగించు చుందురు) తేలికగానుండును. జ్వరాజీర్ణము లందు ముఖ్యము గాడిదెపాలతో వండిన యన్నము క్షయల నణంచును. వేడియన్నములో గేదెపెరుగు గలపి భుజించిన గ్రహణి రక్తగ్రహణులు గట్టును వేడియన్నములో గాచిన తలదిమ్ము తలనొప్పి మెడలనొప్పులు నూడుపోటు యివి హరిం చును. ఆవుపాలు కాచి కొద్దిగా వేడియన్నముపైచి శొంఠిపా డుము చేర్చి తోడుబెట్టి ఉదయకాలమునందు సేవించిన శరీరము నకు మిగుల సౌఖ్యము గలిగించును. చల్లారిన అన్నము అజీ ర్ణము గలిగించును. బియ్యము సడింపులు (మిగుల అరుగదంచి నవి) బలము నివ్వజాలవు. కొంచము తవుడుతో గలసి యుం డుట మంచిది.

వేపుడుపిండి—బియ్యము కొంచెము నూకగావిసిరి ముందు పాత్రలో తాలింపుసిద్ధముచేర్చి తగుపరి నీరు జేర్చి

నూకవైచి సిద్ధముచేసి ఉపవాసములందు వినియోగింతురు. కొందరు పెసరపప్పుగాని శనగపప్పుగాని కలపి వండుటయు గలదు. ఇది ఉష్ణము జేయును. అజీర్ణ మొనరించును.

ఉప్పుడుబియ్యము—ధాన్యమును వుడికించి ఎండబెట్టి బియ్యము చేయుదురు. ఇవి త్వరలో జీర్ణించును. యిడ్డెనులకు పొంగుటకు వీనిపిండి నుపయోగింతురు. అన్నము కొంచ మాలస్యముగా నుడుకును. చెన్ననగరము మొదలగు ప్రదేశములందీ బియ్యము దప్ప పచ్చిబియ్యము వాడరు.

పాయసము (పరమాన్నము)—పాలు బియ్యము శక్కరగాని బెల్లముగాని గలపి వండునది. ఇది గురుత్వము అగ్నిమాంద్యము పైత్యము కాక విరేచనబద్ధకము కఫము వీటిని బుట్టించును. వీర్యపుష్టి బల మొసంగును. అపథ్యకారి.

సగ్గుబియ్యము—దీని జావ తేలికగా జీర్ణమగును. ఉష్ణముగావించును. వాతము హరించును. దోషజ్వరము గలవారికి పాలతో జావకాచి యొసగుట మంచిది. జావలలో పంచదార (శక్కర) చేర్చకూడదు. పరమాన్నము కూడా చేయుదురు.

మొక్కజొన్నలు—వీటియన్నము ,వాతముగావించును. మిగుల బలకరము. త్వరగా జీర్ణముకాదు. ఇవి పేలాలుగా వేయించి భక్షించుచుందురు. వీటికంకులు (పొట్టులులేకబుట్టలు) కాలిచి భక్షించిన రుచిగానుండును. నీటిలో నుడకబెట్టియు తినుటకలదు.

రాగులు—(తమిదెలు) సంకట బలమునిచ్చును. ఉష్ణము తగ్గించును. వీనిపిండిజావగాచి కొంచము లవణము మజ్జిగ (చల్ల) జేర్చి వేసవికాలమందు మధ్యాహ్నము దాగినయెడల తాపముదీర్చి యుష్ణమణగించును.జావకు నీరుగట్టకుండా మొట్ట పెరిగిన తమిదెలు నాణ్యము. యీజావ స్త్రీల కుసుమవ్యాధి పోగొట్టును.

ఆరిగెలు—ఇవి వాతముపైత్యము గావించును. అపథ్య కరము.

గునుగులు—ఇవి తృణజాతిలోనివి లంఘనములందు దారకమున కుపయోగించు చుండుట దోషహరమనియు తేలి కగా జీర్ణించునవియనియు చెప్పనగును.

—♦ జలము ♦—

నీరును వడియబోసి శుభ్రిమొనర్చి పానము చేయవల యును. భోజనమున కాదియందు జలపానమొనర్చిన జఠరాగ్ని తగ్గి శరీరమును కృశింపజేయుచు. భోజనాంత మందొనరించిన స్థౌల్యము (దేహముపెరుగుట) కఫము వీనిని కలిగించును. భోజ నమధ్యమందు ఒకపానమొనర్చిన ధాతుపుష్టి జీర్ణము సుఖము కలిగించును.

శీతోదకము— "శీతంమదాత్యయగ్లాని మూర్ఛాఛర్ది శ్రిమ భ్రిమాః" బడలిక మూర్ఛవాంతి చెమట భ్రిమదప్పుట ఉష్ణము తాపము పిత్తరక్తము విషము వీని నివారించును.

వ్యాధివలన దుర్బలముజెందిన వారికి స్వల్పమైన చల్లని నీరు కూడా యొసగదగదు.

ఉష్ణోదకము—"దీపనం పాచనం కంఠ్యంలఘూష్ణం వస్తి శోధనం" కంఠమునకు హితకరమైనది మిగుల లఘుకరము. మూత్రమును శుద్ధిగావించును. ఎక్కిళ్ళు వాతము శ్లేష్మము నూతనజ్వరము దగ్గు అజీర్ణము పక్కశూల పీనసము శ్వాసము వీనియందును వమనవిరేచనము లందును పథ్యకరము. కాచుట లో పొగలేని యొర్రటి నిప్పులపైని మట్టిపాత్రలో నెమ్మదిగా గాయవలయును.

నారికేళోదకము (ఎళనీరు)—కొబ్బరిబొండమునీరు శుక్ల వృద్ధిగావించును. శీతలమైనది. మూత్రమును శుద్ధిగావించును దాహపైత్య వాతముల నివారించును. క్షయరోగులకును మిగుల యుపకారి.

## —♦ క్షీ ర ము లు (పాలు) ♦—

సర్వజంతువుల పాల కర్థభాగము నీరు పూరించి జల మంతయు శుష్కించి (యిగిరి ఇంకి) పాలు మిగుల సంులకాచ బడినవి హితకరములు. పాలన్నిటిలో ఆవుపాలు శ్రేష్టమైనవి ధాతుక్షయము గలవారికి హితకరము. ధారణాశక్తినిచ్చును. స్త్రీలకు చనుబాలను వృద్ధిగావించును. శ్రమ భ్రమ మదము శ్వాసకాశలు మిగుల దప్పి ఆకలి జీర్ణజ్వరము మూత్రకృచ్ఛ మురక్తము పిత్తము వీనిని పోగొట్టును. ఆవుపాలలో నాలుగు

కరకఫలముల చెక్కలు జేర్చికాచి రాత్రిభోజ నానంతరము త్రాగి పంచుకొనిన లఘువుగా విరేచనము గావించును.

ఎనుము (బరె) గేదె) పాలు—అగ్నిదీనముగల వారికి నిద్రలేని వారికి హితకరము. గురుత్వ మొనరించి శీతవీర్యము గలిగించును. పాలగుణము జంతువుల యాహారమును బట్టిమా రుచుండుట కలదు.

మేకపాలు—మిగుల లఘువుగా నుండును. శోషజ్వర ము శ్వాసము రక్తపిత్తము అతిసారము వీనిని పోగొట్టును. బుద్ధికి బలమొసంగును. తెలివి గలిగించును. పసిబిడ్డల బెంచుట కనుకూల మైనవి.

గొఱ్ఱెపాలు—ఎక్కిళ్ళు శ్వాసము పైత్యము కఫము వీని బుట్టించును. వాతవ్యాధి నడంచును. హృదయమునకు విరోధ మైనవి.

చనుబాలు—త్రిదోషముల హరించును. పైత్యవాత ములు సన్నిపాతములు నేత్రరోగములు మొదలగు వ్యాధుల పో గొట్టును. మిగుల హితకరమైనవి. ఇవి తక్కిన పాలవలె కాచ కూడదు. కనులకు ఉష్ణముజేసిన చనుబాలలో దూది తడిపి వైచిన బాగుగా నిద్రబట్టును. చనుబాలు ఆముదము లోకము గావించి పూటున మర్దించిన శిరమున వేడితగ్గి నిదుర బాగుగా బట్టును.

గాడిదెపాలు—ఇవి స్తన్యములవలె పలచగా నుండును. మిగుల కాకజేసి చల్లారును. శిశువుల ఉబ్బస దగ్గులు శ్వాసలు కరపాణులు విడచి విడచి వచ్చు జ్వరములు హరింపజేయును. శ్రేలికగా జీర్ణమగును.

—♦ శాకములు (కూరలు) ♦—

చెంచలి—మిగుల అగ్నిదీప మొనరించును. వీర్యవృద్ధి గావించును.

చిలుకకూర—త్రిదోషముల హరింపజేసును. లఘువుగ నుండును. మలబద్ధకము గావించును. గ్రహణి మూలవ్యాధుల పోగొట్టును.

చక్రవర్తికూర—త్రిదోషహరము మలమును భేదించును.

కాచికూర—త్రిదోష కుష్ఠహరము. రసాయనతుల్యము శుక్లవృద్ధిని గావించును. స్వరమునకు హితమైనది. దేహమునకు స్వస్థత కలిగించును.

పులిచింత—గ్రహణీ అర్శస్సు (మూలవ్యాధి) వాతము శ్లేష్మము వీనియందు పథ్యకరము. అగ్నిదీపన మొనరించును. మలమును గట్టిపరచును. లఘువుగా నుండును.

చిల్లికూర—రూక్షిగనుండును. మధురపాక రసము గలది. లఘువుగా నుండును. మదము పిత్తము విషము రక్తము వీనిహరింప జేయును. విషజంతువులు కాటందినపుడు నాభి పాషాణాదుల దినినపుడు చిల్లివేరుల రసము త్రాగించిన ప్రాణ

మును కాపాడును. దీర్ఘకాలము ఔషధముల సేవించినవారికి యీకూర దినుపించి పిమ్మట పథ్యమును మాన్పింతురు.

గలిజేరు—తెల్ల ఎఱ్ఱ గలిజేరులు—కరివేప—ఇవి అగ్నిదీపన మొనరించును. మలాదుల భేదించును. పిత్తము శోథ (నంజు) కఫము వాతము వీనిని పోగొట్టును. కరివేపాకు వేయించిన మిరియములు కొంచెము ఉప్పు నూరి మాత్రలొనరించి పెరుగుతో నొసగ గ్రహణులు దొలంగును. లేక కరివేపాకు లవణము మర్దించి పెరుగుతో గ్రోలినను గ్రహణములు హరించును.

మెంతికూర—చూడుగ నుండును. మలమూత్రముల బంధించును.

మునగకూర—విరేచనము గావించును. ఉబ్బ వ్యాధి నడగించును. పుష్టికరముగా నుండును.

సదాపకూర—మూలవ్యాధి త్రిదోషముల హరింపజేసును. జ్వరాతిసారముల గట్టించును. బుద్ధిని హెచ్చించును. దీని యాకులగసము పోయించి పసిబిడ్డల కొసగిన శ్వాసకాసల గట్టించును. వాతమును పోగొట్టును. ఇది కస్తూరికి తుల్యము.

(హాత్స్యక్షి)—పొన్నగంటికూర—మలబంధనకారి. రక్తనికారము కుష్ఠు పైత్యము వీనిని బోగొట్టును. నేత్రరోగములందు పథ్యకరము. దీనిని నేత్రములపై గట్టిన నేత్రరోగముల నడగించును.

ఎలుకచెవి—మూత్ర కఫ క్రిమి రోగముల బోగొట్టును. లఘువుగా నుండును. గర్భములో జంతువు లున్నయెడ దీని భక్షణము ప్రాముఖ్యము.

గొబ్బికూర—శూల విషము అనాహ వాతము మలబద్ధము పాండురోగము నంజు ఉదరరోగము మూత్రబద్ధము వీనిని బోగొట్టును.

తెల్లతోటకూర—కడుపుబ్బర మొనరించును. పైత్యమును దొలగించును. వాతకఫ గురుత్వముల బుట్టించును. ఎఱ్ఱతోటకూర అల్పదోషముగలది. కఫము బుట్టించును. మిక్కిలి గురుత్వము లేనిది.

కొయ్యతోటకూర—దీనికూర మిరుగుల కాకనిచ్చును. వాతరోగులకు హితకరము. పైత్యమేహశూలల బుట్టించును.

ముండ్లతోటకూర—ఇందు తెలుపు ఎరుపు జాతులు కలవు. దీనికూర మేహపైత్యముల నణంచును. స్త్రీలకు పాలు బడును. దీని వేరు నూరి యుడికించి గట్టిన నెత్తురుగడ్డలు వడిసె గడ్డలుపక్వమై పగులును. వేళ్ళకషాయము తెలుపిమ కసపునొప్పి మూత్రనాళము మంట హరింపజేసును.

దొగ్గలి—ముండ్లదొగ్గలి—త్రిదోషహరము. వీనికూర పథ్యకారియని చెప్పుచున్నారు. గ్రంథములందగనుపించదు. యీ జాతి సాధారణముగా ముండ్లతోటకూర జాతిలోనే చేరవచ్చును.

తుమ్మికూర—వాతము పిత్తము గురుత్వము వేడి వీనిని గలిగించును. తమక శ్వాసము కామిల నంజు క్రిమి ఆమము కఫము వీని నణగించును. విరేచనము గావించును.

సరస్వతీకూర—ఆయువును బెంచును. విరేచనముగావించును పిచ్చిని పోగొట్టును. వాక్కు స్వరము జ్ఞాపకము వీని నొసంగును. శ్వాస కాస కఫముల బోగొట్టును.

వాయింటాకు—ఇది కొంచము వాసనగాయుండును దీనిని కొన్ని తావులనందురు. దీనిరసము కాక పైత్యముగావించును. అగ్నిదీప్తినిచ్చి హృదయమునకు మేలుగావించును. సమస్తకర్ణ రోగములు వ్రణములు క్రిములు మూలవ్యాధి హరించును. దీని యాకురసము చెవిలో బిండిన పోటుమానును. ఆకునలచిమాడున గట్టిన మాడు పోటుహరించును. దీనినినూరి కట్టిన వ్రణములుమానును. దీనియాకునూరిచర్మముపైన గట్టిన మెరిబడును. దుష్టనీరును లాగును. మాడున గట్టినపుడు మధ్య మధ్య దీసి నీరు పిండుచుండవలయును.

గాడిదెగడపాకు—ఇది మిగుల చేదు. వంటకు పనిపడదు. వాతము సర్వవిషములు క్రిమిరోగము తామరపొడలు చిడుము మొదలగు చర్మరోగములను మాన్పును. ఇది నూరి మాత్రి బోసంగిన కడుపునొప్పి ముట్టుశూలలను హరింపజేయును. చలి జ్వరముల కట్టించును. యిది ఎండబెట్టి చూర్ణమొనర్చి యొసంగిన నంజులను బాగుపరచును. ఆకునూరి ఆముదమున గలిపి

పూసిన పసికూనల కరపాణులు మూనును ఆముదములో జేర్చి కాచియిచ్చిన బిడ్డల కడుపునొప్పులు హరించును. ఆకులను ఆముదముతో నుడికించి గట్టిన వరబీజములు బిళ్ళలు మొదలగు నవి హరించును.

చింతచిగురు—ఇది పప్పులో వేయుచుందురు. ఉష్ణపైత్య ముల గలిగించును. వాతము మూలవ్యాధి గుల్మము క్రిమి దురద విషము వీటిని హరింపజేయును. కడుపుకుట్టు నీరసము గురుత్వము అగ్నిమాంద్యము గలిగించును. దుష్టనెత్తురు గలిగిం చును. చింతచిగురు చింతకాయ చేర్చి పప్పులో వండిన చామకూర యింటిచూరులో బెట్టిన నిప్పులేకుండా మండునని పెద్దలు సామ్యము జెప్పుచుందురు. అనగా నంత వేడియున్నదనుట. ఎండిం చిన చిగురున కీగుణములు పూండును. దీనిని పథ్యకరముగా నెంచుచున్నారు. ఎండుచిగురు పొడుముగొట్టి పప్పులో వేయు దురు. రుచిగానుండును.

చామకూర—మూలవ్యాధి మూత్రకృచ్ఛ్రము అగ్ని మాంద్యము మూత్రబద్ధకము హరింపజేసును. గురుత్వము కఫ వాతముల. బెంచును.

గొబ్బికూర—నీరుగొబ్బి వీనిసమూలము కషాయము గాచియొసంగిన నంజులు హరించును. నంజురోగులకు దీనికూర మిగుల పథ్యము. వీనివేళ్ల కషాయము మేహశాంతినిచ్చును ఉదరము మూత్రకృచ్ఛ్రముల బాగుపరచును.

బుడ్డబుడుసాకు—దీనియాకు కొంచె మించుగా కాక రానువలెనుండును. దుంపతీగె జాతులు కలవు. కాయలు బోలుగానుండును. వత్తిన పక్కుమనును. దీనికూర పైత్యవాతముల నడచును. విరేచనముగావించును. ఈయాకు పచ్చపెసరపప్పులో జేర్చి రుబ్బి అట్లుబోసిన భక్షించిన మిగుల మేలుగావించును. దీనియాకు చూర్ణము సున్నిలో జేర్చి నలుగుపెట్టుకొనిన శరీర కాంతినిచ్చును.

చిలుకతోటకూర—ఇదే దొగ్గలికావచ్చును. త్రిదోష ములనణచును. రక్తదోషముక్రిమిరోగము విషము అస్రృగ్దరము కుసుమ రోగము వీటినణంచి అగ్నిదీప్తి నొసంగును.

చిట్టింటికూర—దీని యెండబెట్టి వరుగుజేసి వండుట కలదు. ఇదిఅంతపథ్యకారికానేరదు. దీనిగుణము విచారణీయము

కొండపిండి—(పాషాణభేది) మూత్రబద్ధకము దొలగించును. అశ్మరీవ్యాధులు (అంగమందురాళ్లుగట్టు) మాన్పును. ఉబ్బు శూల శుక్లదోషము గుల్మము మూలవ్యాధి వ్రణములు అతిమూత్రము వీనిని హరింపజేసును. కూరవండుట కలదు. రుచిగానుండును.

పుదీనా—దీనిని వేయించి పచ్చడి (చట్నీ) చేయుదురు అజీర్ణము పైత్యము వాతము వీని హరింపజేసును. వాంతుల గట్టించి అగ్నిమాంద్యము అరుచుని దొలగించును. కడుపునొప్పి హరింపజేసును. సర్వరోగములను దొలగించును.

అవిసెకూర—విరేచనము జేయించును. అగ్నిదీప్తి నిచ్చును. విషహరము అరుచిపోగొట్టును. పైత్యము నణంచి ఆరోగ్యమొసంగును.

సీకాయాకు—దీనిని వేయించిపచ్చడిజేయుదురు. పైత్యముఅరుచి వీనిని బోగొట్టి జఠరదీప్తి నొసంగును. విరేచనము గావించును. దీనికాయల రసముతో తలరుద్దుకొనిన మిగుల మంచిది. నేత్రములకు హితమొసంగును.

గోంగూర—ఇది రుచిగానుండును. పైత్యమును బుట్టించును, మలబద్ధకమును బోగొట్టును. రక్తవృద్ధి నణంచును. రేజీకటిగలవారికిది పథ్యకరము. ఇది వేయించి ఉప్పుజేర్చి పచ్చడి బెట్టుచుందురు. పాతపచ్చడి పథ్యకరము రుచినిబుట్టించును.

కొంతిమెర—ధనియాలఆకు ఇది లేతది సువాసనగాయుండును. చారుమొదలగు వాటియందును పచ్చడులందును వేయుచుందురు. ముదిరనఆకు చాలా పైత్యమొనరించును.

బొడ్డుపాయల— ఇందుపుల్లపాయల పిన్నపాయల భేదములుగలవు. రుచికరముగానుండును. ఉష్ణముగావించును. సంగ్రహిణి అశ్మరి మూలవ్యాధి నీరుచురుకు వీనిని పోగొట్టును వాంతివికారము పైత్యముల నణచును. త్రిదోషహరమైనది. విశేషముగా దినిన శ్లేష్మముబుట్టించును. కండ్లకు జబ్బుజేసును

చుక్కకూర—(పుల్లబచ్చలి) మేహపైత్యము విషములు కడుపుమంట వీనిని హరింపజేయును. ఆకలిగలిగించును.

విరేచనము గావించును. గ్రహణికట్టించును. శ్లేష్మవాతముల
బెంచును. దీనికి కొబ్బరిపానకము విరుగుడు.

బచ్చలి—దీనికూర చలువగావించును. విరేచనకారి
త్రిదోషహరము. దాహతాపముల నణచును. మేహము
వాతము కాస వీనినిపోగొట్టును. బచ్చలికూర చింతకాయ కల
వేసి వండిన మిగుల ఉష్ణమని వాడుకగలదు.

బొడ్డుపావిలికూర—చలువజేసి నిద్రగూర్చును. గురుత్వ
మొనరించి వ్యాధినిబుట్టించును. వాతముగావించును. మిక్కిలి
దినిన ఉష్ణముగావించును.

బొద్దికూర—పథ్యకరము. త్రిదోషహరము పురాణ
గ్రహణులు మూత్రవ్యాధులు క్షయపాండువిషముల జరమా
ర్చును. ఉబ్బసము నణంచును. దీని నూరిగట్టినక్రొత్తగాయములు
మాన్పును.

మటుబచ్చలి—తుంపబచ్చలి పొలముబచ్చలి గురువుగ
నుండును. మలాదుల భేదించును. శ్లేష్మకారి. శీతలమిచ్చును.

తుమ్మికూర—గురుత్వము వేడి పైత్యములొనరించును.
రుచికరము విరేచనకారి తమకశ్వాస కామిల నంజు ఆమము
క్రిములనణంచును. దీనిపూలరస మొసంగిన శీతజ్వరములు
మన్యజ్వరములు నిస్సంశయముగా నివారించును.

కసిందాకుకూర—పుష్టిని గలిగించును. దగ్గు విషము
నెత్తురుయొక్క మలినము కఫవాతములు వీనిహరింపజేసును.

జీర్ణకారి దీనికి కాసారియనిపేరుండుటచే దగ్గుల పోగొట్టుట యందు మిగుల శక్తిగలది.

బలుసాకుకూర—చలువ గురుత్వము గ్రాహులు మేహములు పైత్యములజయింపజేసున. జ్వరముల నణంచును.

కుప్పింటాకు—ఇది యనేకరోగముల మాన్పును. దీని పసరుబూసిన తీటతామర పుండ్లుమానును. కషాయము లోపలికిపుచ్చుకున్న విరేచనములగును. దీని యాకుచూర్ణము సేవించిన దగ్గు గట్టించును.

పొట్లకాయ—ఇది మిగుల పథ్యకారి. త్రిదోషహరము అగ్నిదీప్తి నొసంగును. శ్లేష్మవాతతత్వముల కనుకూలముగాదు.

బీరకాయ—త్రిదోషహరము పథ్యకారి. ఆకలిబుట్టించును. విరేచనము గావించును.

నేతిబీరకాయ—పైత్యవాతముల నణచును. సారమైనది.

కాకరకాయ—కొంచము అజీర్ణకారి కఫమును హరించును. తెల్లకాకరకాయ శ్రేష్ఠమైనది.

అగాకర—(అడవికాకర) త్రిదోషహరము. రుచిని బుట్టించును. కషరసముకలది.

పొట్టికాకరకాయ—త్రిదోషహరము క్రిమివిష కుష్ఠాది రోగముల నణచును. ఉష్ణపైత్యముల గావించును. జఠరదీప్తి కాంతినిచ్చున

వంకాయ—"వార్తాం కోమలం పథ్యం కూష్మాండం

బుడమకాయ—ఆకలిబుట్టించును. పథ్యకారి వాతపైత్యశూల మూలవ్యాధుల నణచును. మలమూత్రముల గావించును. పండుకాయ గురుత్వము మేహశాంతి గావించును.

నక్కదోస—పథ్యకరము. జ్వరములందు అరుచిని బాపును. శ్లేష్మవాతముల మలమూత్రముల గావించును. గురుత్వము.

నల్ల అలచందకాయలు—కాస శ్వాసనంజులు మూల గుల్మములు పైత్యశ్లేష్మముల బోగొట్టను. వాతముగావించును.

కామంచికాయలు—వీనికూర త్రిదోషహరము అగ్నిదీప్తి గావించును. పాండు శోఫ (నంజు) మూలవ్యాధి పైత్యకఫ మేహాదు లణంచును. వేడిజేసును. దీనిని కాసరఅనియు వాడుచున్నట్లు వ్రాసినారు.

కాసరకాయలు—ఇవి కాకరకాయలవలె చిన్నవిగానుండును. జఠరదీప్తి దేహదార్ఢ్యము గలిగించును. గుల్మనేత్రవ్యాధుల హరింపజేసును శ్లేష్మవాతముల గావించును.

చిక్కుడు—పెద్దచిక్కుడు గురుత్వము దాహము కఫముల బుట్టించును. బలముగలిగించు వాతపైత్యహరము అపథ్యకారులు.

నల్లచిక్కుడుకాయ—వాతహరము. మలబద్ధము గురుత్వము పైత్యశ్లేష్మముల గావించును. అపథ్యకరము.

గోరుచిక్కుడుకాయ—ఆకలి గలిగించి పైత్యమును బాపును. వాతకఫ గురుత్వముల గావించును. విరేచనకారి.

మునగకాయ—పైత్యము శ్లేష్మము శూల కుష్ఠ క్షయ శ్వాస గుల్మముల బోగొట్టును. అగ్ని దీపనమొనరించును. మునగకూర నంజులందు పథ్యకరము విశేషనము గావించును. మునగపువ్వుకూర త్రిదోషహరమైనది.

బెండకాయ—వాతగురుత్వముల గాచించును. కఫబల వీర్యముల బెంచును. పీనస వాతరోగులకు అహితము. అగ్ని మాంద్యము గలిగించును.

గరుగ్గాయలు—(కొండరేగు అనియు బిలుతురు) ఇవి ఊరగాయలుగా జేతురు. రుచిగానుండును. మంచి త్రేనుపులు వచ్చును. మిగుల దోషకారిగా గనుపించదు.

వాకకాయలు—ఇవి వేయించి పచ్చడిజేతురు. జఠర దీప్తికొసగి దాహము బుట్టించును. వాతపైత్య జీర్ణముగావించును. కంఠమునకు కీడొనరించును.

వెలగకాయ—పథ్యకరము. దీనిగుజ్జు పెరుగుతోనూరి పచ్చడి జేతురు. పప్పులో వేయుచుందురు. పైత్యశాంతినిచ్చును. గ్రహణులందు మిగుల పథ్యకరము. త్రిదోషహరము. రుచిని బుట్టించును. వాంతులనట్టించును. దీనియాకులను నీటిముంచిరి తోవాల్చి రసముతీసి చల్లార్చి తేనెవైచి యొసంగిన వాంతులు పైత్యము హరించును.

దానిమ్మపండు—తియ్యదానిమ్మ పుల్లదానిమ్మలుగలవు. సాధారణముగా గుణముల వ్యత్యస్తములేదు. పథ్యకరము.

అరుచి నోటిసీరు పైత్యముల నణచును. గ్రహణుల గట్టించును. విత్తులు పచ్చడిగా నూరుదురు. దీనిచిగురు నలచి గేదెపెరుగుతో భక్షించిన గ్రహణులు గట్టును. కాయలచర్మమును కొంచము ఉప్పుజేర్చి నూరి పెరుగుతో భక్షించిన గ్రహణులు కట్టును.

రేగుపండు—ఇవి ఉప్పుజేర్చి తొక్కి-వడలుగాజేసి యెండబెట్టి దాతురు. రక్తశుద్ధినొనరించును. కఫపైత్యగురుత్వముల గావించును. మేహవాతముల బాపును. విరేచనబద్ధము.

పుచ్చకాయ—రుచికరము. మూర్ఛపైత్యము మూలవ్యాధి నేత్రరోగులకు మేలుగావించును. అగ్నిమాంద్యము కఫవృద్ధి చలవ గావించును. దీనిముక్కలు పులుసుతో వైచివండుచుందురు.

కోసుపువ్వు—ఈప్రాంతమున అరుదు. సమోష్ణము గను జీర్ణకారిగా నుండును.

కాసుములక—ఇందు ఒకటి రెండు భేదములు గలవు యితరత్రా పేరు భేదముగలదు గుండ్రనివి కొన్ని గుమ్మడికాయలవలె డోరియాలు గలిగి పెద్దవిగా కొన్నియుండును. పిత్తులు వంగపిత్తుల బోలియుండును. గుండ్రని వాటిని కొన్నితావుల ఇవిమటగాటాలని వాడుచుందురు. ఉష్ణగుణములు గలవి యగుటచేకొంచము పైత్యము గావించును.

పందిరిదంగ—దీనిగుణము విచారణీయము. పథ్యకరముగాదు.

పనసకాయ—దీనిని తూరుపు విశేషము కూరగా వండుట కలదు. శ్లేష్మవాత మేదస్సుల బెంచును. పైత్యహరిణ చును. బలవీర్యముల వృద్ధిగావించును. గురుత్వము. అపథ్యకరము.

మేడికాయలు—దీనికూరరుచినిచ్చును. వాత పైత్యకఫములు అతిసారమూల వ్యాధులు ప్రదర కుసుమరోగములు చర్ధిప్రమేహములుహరించును. ముగారుకాయలు వాతము గురుత్వము అగ్నిమాంద్యము కలిగించును. దీనిపండు మేహపైత్యక్షయాతిసారాదుల బాపును. శ్లేష్మమును బెంచును.

కొబ్బరికాయ—పచ్చికొబ్బరి పెరుగుతో పచ్చడిచేయుటయు మిరపకాయలు వేయించిచేర్చి కొంచముచింతపండువైచి నూరుటయు కలదు. లేతకొబ్బరి మంచిది. పంచదారతో దినిన మంచిరక్తము బుట్టించును. కడుపులో వ్రణము మూలవ్యాధి పోగొట్టును. దేహపుష్టి వీర్యవృద్ధి గావించును. శ్రమ శోషల హరింపజేసును. ఇప్పుడు నారికేళఫల చికిత్సల గనిపెట్టి యున్నారు. దీనినే ఆహారముగా గొని ఆరోగ్యము బొందుచున్నారు.

మిరపకాయలు పచ్చివి—కాక పిత్త కఫముల గావించును. మిక్కిలిదినిన వీర్యనష్టము. ఉష్ణదేహులకుగిట్టను. మిగుల పైత్యముజేసును. ఎండువి జీర్ణకారి ఆహారమున కనుకూలము. గాయములు నీరుబట్టినయెడ ఎండుమిరపకాయలనూరి కారము

జేసి గాయముపై ముందునేతి గుడ్డనువైచి పైనకారము బోసి గట్టిన నీరుదీసి సుఖమిచ్చును. కారపునీరు మూడుగొట్టములు బెట్టిన పశువుల కడుపుబ్బురములు హరించును. మిరపకాయలు వేయించి అందునీరుబోసి దింపియానీరొసంగిన కలరా అజీర్ణములు హరించును. వీర్యనష్టము గావించును. మిక్కిలి దినిన కోపము బుట్టించును.

వాకుడుకాయలు—వీని యిగురు కఫవాత శ్వాస కాసలు. జ్వరముల హరింపజేసును. విత్తనముల పొగచుట్టలలో బోసిచుట్టి పొగత్రాగిన దగ్గుహరించును. శ్లేష్మహారము.

అరటికాయ—అరటిపూత అరటిదూట అరటికాయ వీనిని పక్వముజేతురు. వీనిలో ననేకజాతులుకలవు. చక్రకేళీలు శ్రేష్ఠమైనవి. ఇదిరక్తకాస గ్రహణి అతిమూత్రరోగులకు హితకరము. ముదిరినకాయచూర్ణము బిడ్డల అజీర్ణము పెద్దలకు సెగరోగము బాపును. మిరియాలు వెచ్చజేసి చూర్ణమొనరించి చక్రకేళితో సేవించిన కాసలు గట్టును. అరటిగడ్డ రసము మేహశాంతి గావించును. అరటిపూచ చక్రములగా తరిగి నిమ్మపులుసుతో ఊరబెట్టి భక్షించుచుందురు. అరటిపూచ పూతకొంచము వ్యత్యస్థ గుణములు గలిగి కాయకు బోలి యుండును.

ఆలుబకార—దీనిని సీమచింతకాయలని జెప్పుదురు. పథ్యకారి పైత్యముల నణచును. రుచినిబుట్టించును. జీర్ణము కలిగించును. జ్వరితులకు దీని చారుబెట్టి యొసగవచ్చును.

అనాసకాయ—అపథ్యకరము. వాతపైత్య కఫముల గలిగించును. గురుత్వముజేసును.

—♦ దుంపలు ♦—

ఆలుగడ్డలు--(బంగాళదుంపలు) గురుత్వము మలబద్ధము గావించును. కఫవాతముల బెంచును. పైత్యము నణగించును. మలమూత్రవిభజనముగావించును. పుష్టినిచ్చును.

ముల్లంగిగడ్డ—త్రిదోషహారమైనవి. తేలికగజీర్ణించును. రుచినిబుట్టించును. ముల్లంగిముక్కలు ముందు నీళ్ళతో ఉడికించి అవివంట కుపయోగించుకొనవలయును. లేనియెడ వాసనగాయుండును. లేతది శ్లేష్మము లేతముల్లంగి నొక పనుగనిచ్చి కొనవచ్చుననియు ముదురు ముల్లంగి నొక్క పనుగనిచ్చినను గ్రహించకూడదనియు సామ్యముకలదు.

కందగడ్డ-కఫమును పోగొట్టును. రుచికరము యింద్రియ శుద్ధిగావించును. అగ్నిమాంద్యము దొలగించును. మూలవ్యాధులందు పథ్యకరము. అడవికంద మూలవ్యాధి నణచును. చూర్ణముల కుపయోగించును.

పెండలము—కఫవాతముల గలిగించును. పైత్య కాకి దాహమునణచును. గురుత్వము అగ్ని మాంద్యముమలబద్ధకము గావించును. మేహశాంతి వీర్యపుష్టి నొసంగును.

కఱ్ఱపెండలము—ఇది అపథ్యమైనది. పైత్యవాతముల గురుత్వము అజీర్ణముగావించును "కటుస్స్నో వాతకఫహా

ద్రాక్ష—మదాత్యయము వాతము పైత్యము రక్త క్షయ కాసశ్వాసలు జ్వరము దాహము స్వరభేదము వీనిని పోగొట్టును. మలమూత్రముల గావించును.

పచ్చిద్రాక్ష—(అంగూరు) జీర్ణము బలము పుష్టి నిచ్చును. పుల్లనిది అరుచి కఫము రక్తపైత్యముల బుట్టించును. విదాహకారి.

అంజీరపండు—(సీమమేడి) క్షయ కాస అజీర్ణము కఫ వికారముల నణచును. వీర్యపుష్టి దేహబలము హృదయము ధాతువులకు బలమొసంగును. మేహశాంతినిచ్చును.

మేడిపండు—శోఫ (నంజు) క్రిమి హృద్రోగములు పైత్యకఫమేహములు కరపాదముల మంటలు వీనినిపోగొట్టును. మూలవ్యాధులందు పథ్యకరము. లేతవి యిగురుగావండి భక్షించుచుందురు. దీనివేరునూడి కల్లువంపి త్రాగుచుందురు. ఇది దాహరోగముల నణచును.

మామిడిపండు—కఫము వీర్యవృద్ధి కాంతినిజేయును. వాతమును బోగొట్టును. బలము సంతోషము వీనినిచ్చును. చర్మముతోడ భక్షించుటయు పగలు నీటిలోనైచియుంచి రాత్రిపూట సేవించుటయుమంచిది. పచ్చికాయ త్రిదోషకారి. దీనిపూతను పచ్చడిజేయుదురు. పప్పులో వేయుటయు కలదు. దీని చక్కెరసము పంచదార పుచ్చుకొనిన కాక రోగములు స్త్రీలకు కుసుమవ్యాధులు హరించును.

నారింజఫలములు—అన్నహితవును వాత శమమును గావించును. మేహపైత్యముల సంహరించును. ఆకలి గలిగించును. దగ్గు జ్వర పిదాహముల నణచును. రక్తశుభ్రము గావించును. చలవ తత్వము గలవారికి అహితము. దీనితొనలు పచ్చడి గావింతురు. రుచికరము.

బత్తాయినారింజ—మిగుల రక్తశుద్ధిని గావించి రక్తమును బెంచును. పైత్య ఉష్ణ మేహములనణచును. ఖండాంతర వైద్యులు వీనిని జ్వరములందుసహా వాడుచున్నారు. నారింజకంటె బత్తాయిని విశేషముగా వాడుచున్నారు. సాధారణముగా పథ్యకరములనియె భావించవచ్చును.

నిమ్మఫలములు—వీనిరసము గురుత్వము గావించును. దప్పి శూల కఫము వాంతి నేత్రరోగము శ్లేష్మము మలబంధము పైత్యము వీనిని బోగొట్టును. మిగుల పథ్యకారి. ఈ ఫలములకోసి ఊరగాయ బెట్టుదురు. దీనిరసము వేడినీటిలో గలపి తాలింపుబెట్టి చారుజేతురు. ఇది జ్వరితులకు హితకరము

దబ్బఫలములు—వీనిముక్కలు ఊరుగాయ బెట్టుదురు. వీనిపులుసు పప్పులోజేర్చి చారు గావింతురు. పథ్యకరము. నారింజ జాతిలోనిది యగుటచే దానిగుణములు కలిగియుండును.

మాదీఫలము—లఘుకరము. అగ్నిదీపన మొనరించును. నాలుక గొంతు జొమ్ము వీనిని బాగుగా శోధించును. పైత్యవాతముల నణచి శరీరపుష్టి నిచ్చును. శూల గుల్మముల

బాపును. దీనిరసము దానిమ్మ, నిమ్మ, నారింజ మొదలగు రస ములజేర్చి తేనెవైచి గాచిన మాజీఫల రసాయన మగును. ఇది పైత్యముల నణచును. రుచిని బుట్టించి జీర్ణ మొసంగును.

చింతఫలములు—(చింతపండు) వాతమణచును. కాక శాంతించును. కఫ గ్రహణులను బోగొట్టును. పిందెలు గురుత్వ మిచ్చును. త్రిదోష రక్తదోషముల హరించును. ఆమ్లకాఽమా గురుర్వాత హరాపిత్తకఫా స్రజిత్॥ పండినవి జఠరాగ్నిని వృద్ధి గావించును. చిగురు భ్రమ దప్పి బడలిక వీనిని బోగొట్టును. (పైత్యము గావించును. అనుభవము) అగ్ని దీపనమొనర్చును. కఫవాతముల హరింపజేసును.

ఉసిరికఫలములు—వీనిపచ్చడి నల్లపచ్చడని వాడుచుం దురు. మేహము పైత్యము వీని నణచును. రుచికరము విరేచన బద్ధకము గావించును. వాతరోగులకు గిట్టదు. ఈఫలముల కొందరు యిగురుగా వండుట కలదు. ఇది త్రిఫలములలో నొకటి.

ఉస్తిపండ్లు—ఇవి ఆవ్య నేతిలో వైచి కాచి బిడ్డలకు బెట్టిన దగ్గులు హరించును. విత్తుల చూర్ణము తేనెలో నాకిం చిన దగ్గులు హరించును.

ఖర్జూరఫలములు—పైత్యతాపముల నణచును. శక్ల రక్తముల నభివృద్ధి గావించును. ధాతు వృద్ధి కరము. వీని చక్కలు నీటిలోవైచి నానబెట్టి త్రాగిన వడదెబ్బ ఉష్ణ విరేచ

నములు అణగును. వీటి ఫలములలో గసాలు నల్లమందు కొంచము రస సింధూరముకూరి పైనచీరమృతిక నిచ్చి పుటము బెట్టి నూరి మాత్రలొసంగిన గ్రహణులు గట్టును.

కమలాఫలము—పైత్యమేహముల శాంతి జేయును. దాహ వాంతుల గట్టించును. మెదడుకు హాని గలిగించును. దగ్గు బుట్టించును. అపథ్యకరమైనది.

నేరేడుపండ్లు—స్రోతో మూత్ర పురీష రోధనకరం॥ స్వేదమూత్రి మలాదుల బాధించును. కంఠమునకు కీడు గావించును. వాతగురుత్వముల గాంచును. పైత్య శ్లేష్మముల నణచును. ఇవి ఒకటి రెండు నత్సరమున కొకతూరి దినిన లోపలి వెంట్రుకలు నశించునని పెద్దలు జెప్పుట కలదు.

పెద్దరేగపండు—పైత్యము జ్వరము కఫము వీని నణచును. అగ్నిదీప్తి పుష్టినిచ్చును.

తాటిపండు—అపథ్యకరము. పిత్తరక్తశ్లేష్మ వివర్ధనమ్॥ రక్తపిత్తము శ్లేష్మముల బుట్టించును. దీని ముంజలు కొంచము మత్తుగను తేలికగా నుండును. శ్లేష్మమును బెంచును. వాత పైత్యముల బోగొట్టును.

పనసపండు—దీనితోనలు తృప్తిగను వాతపైత్యముల హరించునవిగా నుండును. వీర్య బల కఫముల బెంచును. అపథ్యకారి.

పంపరపనస—శ్లేష్మము వాతము అజీర్ణము క్రిమి భగందరముల బుట్టించును. గురుత్వము గావించును. శ్రాంతి విరుగుడు.

జామిఫలము—కఫ శుక్లముల వృద్ధి గావించును. వాతపైత్యముల బోగొట్టును. గ్రహణుల గట్టించును. అపథ్య కరము. భోజన మొనర్చిన వెంటనే భుజించిన గిట్టును.

శీతాఫలము— రక్తవృద్ధికరము రక్తపైత్యదాహవాత ముల నణంచును. శీతముబుట్టించును. (మిగులదినిన శీతజ్వరము కలుగుచుండును. అనుభవము)

రామాఫలము—కఫవాత రక్తవికారములు తృష్ణా దాహపైత్యములు క్షుదాశ్రిమలు ఇవి హరించును.

అనాసకాయ—కఫపైత్య గురుత్వము లొనరించును. బడలికదీర్చును. హృదయమునకు హితవుగావించును. పండు పైత్యమును ఎండతాపమును బోగొట్టును.

మొకలిపండు— ధాతువృద్ధి గురుత్వము లొనరించును. వాతపైత్యముల హరింపజేసును.

కాఫి—కాఫీగింజల కషాయము నిద్రినుబోగొట్టును. బద్ధకమణచును. దీపనకారి మూత్రిమును గావించును. జలుబు నణంచును. కలరా వాంతినిగట్టించును. దగ్గులు తలనొప్పులు మూలవ్యాధులకు మంచిది. వీర్యనష్టము. విరేచనబద్ధకము

పైత్యము వీనినిగావించును. అతిమూత్రవ్యాధిని గలిగించును. ఇది, ఉష్ణదేశస్థుల కనుకూలించదు. ఇప్పుడు తెల్లవారినిజూచి ఆంగ్ల భాషాపరిచయులు విశేషము వాడుచున్నారు. రక్తవృద్ధి వినాశకరము. ఎక్కడజూచినను కాఫీహోటలే. ఈ హోటలకు నీచత్వములేదు. దీనిపానము విక్రయులు గౌరవస్థాన మాక్రమించు చున్నారనియే జెప్పవచ్చును. దేశమునకు దరిద్రము గూర్చునట్టి అభ్యాసములు మిగులతీవ్రముగా వ్యాపించుననుటకు సందియములేదు.

తేయాకు—దీనికషాయము పాలలోజేర్చి శర్కరవైచి పుచ్చుకొనుచున్నారు. ఆకలిబుట్టించును. జీర్ణకారి నరములకు బలిమినిచ్చును. నిద్ర బడలికనుపోగొట్టును. చెమటబుట్టించి మూత్రముగావించును. జలుబు తలనొప్పి నణచును. వాతాజీర్ణమును హరించును. హృద్రోగము వణకు నోటిదుర్గంధము కామిల ఉబ్బు (నంజు) పాండురోగము వీనిబోగొట్టును. అమితసేవనము నిద్రాభంగము కలిగించును. పరగడుపున బుచ్చుకొనగూడదు. భోజనానంతరము బుచ్చుకొనవలయును. నరముల సంబంధమైన చేతులు కాళ్లు దేహమువీనియందువణకుబుట్టించునని కొందరిమతము. వాతశ్లేష్మతత్వము గలవారికి శీతలప్రదేశవాసులకిది విహితము పైత్యముగావించును.

## —♦ జ్వరితునికి క్షీరము ♦—

శ్లేష్మము క్షయించినవానికిని సర్వాంగతాపముదప్పి కలవారికిని పిత్తముచే పీడింపబడిన వారికిని క్షీరపాన మలవాటు గలవానికిని జ్వరితునికి పాలుత్రాగుట విహితకరము. అతి సార యుక్తజ్వరితులకును క్షీరము పథ్యకరము. లంఘనాములచే పీడిం పబడిన జ్వరితునికి క్షీరపానము సౌఖ్యము గలుగజేయుటయే గాక త్వరితముగ జ్వరముహరింపజేసును.

## —♦ జ్వరహరక్షీరము ♦—

ఆవుపాలలో శొంఠి ఖర్జూరము ద్రాక్ష ఆవునెయ్యి వైచి కాచి పంచదారజేర్చి చల్లారినపిదప కొంచెముతేనె జేర్చి జ్వరితునికి పానముజేయించిన ఆరోగ్యముకలుగును.

ఆవుపాలలో ద్రాక్షపండ్లు ముత్తువపులగము యష్టి మధుకము నల్లసుగంధి పాలకణమనుధాన్యము చందనము జేర్చి చక్కగగాచి చల్లారినమీాద తేనెజేర్చి పానముజేయించిన దప్పి సర్వాంగతాపము జ్వరముహరించును. వేడిగానున్న పాలలో తేనెవైచి త్రాగిన ప్రాణాంతము కలిగించును గాన తేనె జేర్చవలసివచ్చిన బాగుగా చల్లారవలయును.

...ంటి ముత్తవపులగము వాకుడు పల్లేరు బెల్లము ... చక్కగాకాచబడిన పాలను పానము ...మూత్రబంధము అపానవాతబంధము

మొదలగువాటిలో కూడినజ్వరము కాసము హరించును.

జ్వరశోషహర క్షీరము. సన్నగలిజేరు మారేడు పెద్ద గలిజేరు వీనిలో కాచబడిన పాలుత్రాగిన జ్వరము నంజుహరించును.

కాఫికిబదులు పానక్షీరము—శొంఠి ధనియాలు సుగంధ పాలపట్టు భూచక్రగడ్డ పెన్నేరుగడ్డ యివి సమములుగ నలియగొట్టి కషాయముగాచి పాలలోజేర్చి శర్కరగలపి పానము జేసిన బలము పుష్టి వీర్యవృద్ధి ఉష్ణశమనము గలుగును. అనుభవమైన ప్రక్రియ.

మరియొకవిధము—ధనియాలు సోపు పిల్లిపీచర వేళ్ళు శొంఠి వట్టివేళ్లు వీనికషాయము గాచి పాలలోజేర్చిపంచదార వైచి త్రాగిన మిగుల సుఖకరము.

ఇడ్డెనలు—మినపపప్పు నానబెట్టి రుబ్బి ఆవిరిమీద వండినవి శ్రేష్ఠతమము బలము పుష్టి వీర్యవృద్ధి వీనిని గలిగించును. ఇందులో మిర్యాలు కొంచము అల్లముముక్కలు గలుపుట మంచిది. జీర్ణశక్తి బాగుగా గలవారికే ఇవిఅనుకూలము. కొందరు ఉబ్బుటకు ఉప్పుడుబియ్యము చేర్చుచున్నారు. ఇవి అంతబలము నివ్వజాలవు.

మినపముద్దలు—మినుములు వేం[illegible] గావించి తాటిబెల్లము ఆవునెయ్యి జేర[illegible]

పాత్రియందు భద్రపరచి మధ్యాహ్నము ఒకముద్ద పుచ్చుకొనిన మేహశాంతి గలిగించి బలమొసంగును. వీర్యవృద్ధి గావించును. వెనుక మనుగుడుపులందు యివి పెండ్లికొడుకులకు బెట్టు ఆచారము గలదు. ఇప్పుడుమోటు. వెనుకటివారు గనిపెట్టిన వాటిగుణము గ్రహించిన వారి ఆహారవిషయము తెలియగలదు. జీర్ణశక్తి గలవారికి గారెలకుమించిన బలకరవస్తువు మరియొకటిలేదు.

బాలగ్రహములు—ఇందు మాతృకలు సామాన్యగ్రహము బాలగ్రహములుగ్రంథములందువివరింపబడియున్నవి. పురిటిదినములు పదింటిలో సోకుగ్రహములు (౧ నందినీ ౨ సునందన ౩ ఘంటాలి ౪ కంటకాలి ౫ అహంకారి ౬ షష్టిక ౭ సింహిక ౮ ఆర్యక ౯ మేషి ౧౦ రోదసీ) పది సామాన్యగ్రహములు (౧ స్కంద ౨ స్కందాపస్మార ౩ శకునీ ౪ రేవతీ ౫ పూతన ౬ అంధపూతన ౭ శీతపూతన ౮ ముఖమండికా ౯ నైగమేయగ్రహములు) తొమ్మిది మాతృకలు (౧ నంద ౨ సునంద ౩ పూతన ౪ ముఖమండికా ౫ కటపూతన ౬ శకునీ ౭ శుష్కరేవతి ౮ ఆర్యకా ౯ భూసూతికా ౧౦ నిర్ఋతి ౧౧ పిలిపిచ్ఛికా ౧౨ కాముకా.) పదిరెండు ఇవి ప్రథమదినము ప్రథమమాసము ప్రథమవత్సరమున ప్రథమ మాతృకయును అటులనె రెండవదినము రెండవ నెల రెండవవత్సరమందు

రెండవ మాతృకయు నిటులనే పదిరెండు వత్సరములవరకు పదిరెండు మాతృకలు పూనుచుండును. పదిరెండు వత్సరముల వరకు ప్రతిదినము, ప్రతిమాసము ప్రతివత్సరము గడచుట గండము గావున వివాహములు బాలికలకైనా పదిరెండు వత్సరములు గడచినమీదట యొనరించుట సర్వోత్కృష్టము ఈగ్రహమాతృకాదులకు మంత్రి యంత్రములు ధూపములుబలి హరణము (తీసివేతలు) మొదలగునవి యనేకములు గలవు. కొన్ని రహస్యము లగుటచే వివరింపబడవు.

సామాన్యగ్రహలక్షణములు—ఉలికిపడుట యేడ్చుట భయపడుట గోళ్ళచే తల్లిని తనను గీరికొనుట పలుమారు దీర్ఘముగజూచుట పండ్లు కొరకుట కేకలిడుట ఆవలించుట కనుబొమలు పెదవులు వీని నెగరవేయుట పలుమారు నురుగు గక్కుట చిక్కిపోవుట రాత్రులందు నిదుర లేకుండుట వాపు గలుగుట మలము పలచగా వెడలుట దేహము గరగరలాడుట మాంసము రక్తము ఇవి వాసనగల్గుట పాలుగుడుచుటయం దిచ్ఛ లేకుండుట యీలక్షణము లున్న యెడ నవగ్రహములలో నేదియో గ్రహము సోకినదని గ్రహింపవలయును.

సర్వగ్రహధూపము—కోడియొక్క రెండుప్రక్కలగల రెక్కల యీకెలు తోకయీక ఆవు నెయ్యి వీని నేకమొనర్చి శిశువుపట్టిన దాది ఏడుదినములు ధూపము చేయవలయును.

కం. సర్వచరాచర నాయక
గర్వాంధ విదూరదుష్ట కాననకీలా
నిర్వాణనాథ సకలసు
పర్వాణస్తుత పరేశ భక్తసు పోషా.

గద్య.

ఇయ్యది వైశ్యకుల పారావార రాకానిశాకర శతృవర్గ భీకర
కౌండిన్యసగోత్ర పవిత్రసుజనమిత్రబసవయసుబ్బాం
బాప్రియపుత్ర కంకిపాటి తాతయ్యార్య సర
మాంబాదుహితృబంధుజనాప్త వెం
కటసుబ్బరాయగుప్త విరచిత
అనుభవగృహ వైద్య
గ్రంథమున ప్రథమ
సోపానము.







ఓమ్

శ్రీమద్దన్వంతర్యేనమః.

# అనుభవగృహవైద్యము.



## ద్వితీయసోపానము.



శ్రీనిగమాగమవందిత
సానందాద్యఖిలమౌని సన్నుతచరణా
దీనజనావన భువిసం
తానాకల్మష విదూర ధర్మవిచారా.

### ప్రతిగృహమందును సామాన్యముగా నుంచవలసిన వస్తువులు

౧ కస్తూరిమాత్రలు
౨ సన్నమాత్రలు
3 మేలగు విరేచనమాత్రలు
౪ ఆనందభైరవము

౫ స్వచ్ఛన్నము
౬ హుతాశనము
౭ సామాన్యకలికము
౮ శంఖద్రావకము
౯ మాజీఫలరసాయనము
౧౦ అజీర్ణహరమాత్రిలు (చామంతిపుష్పములపై)
౧౧ ఓమముయొక్క పువ్వు
౧౨ ఓమద్రావకము
౧౩ రసభస్మము
౧౪ నిమ్మఉప్పు
౧౫ శోడాఉప్పు
౧౬ మంచివంట యింగువ
౧౭ తేనె
౧౮ శీతాంశురసము
౧౯ లఘుజ్వరమాత్రిలు
౨౦ శంఖభస్మము

౨౧ గవ్వభస్మము—వీని తయారొనర్చు పద్ధతులు ముందు దెలుపబడును. ఈ యౌషధములలో మిశ్రితము కాబడు నాభిమొదలగు ద్రవ్యశుద్ధులును పుస్తకముయొక్క చివరభాగముననే వివరింపబడును.

## ఇంగ్లీషు యౌషధములు.

౧ కొయినా (క్వినైన్ బార్కు) ఇది జ్వరములను గిట్టించును. శీతజ్వరములందు మిగుల యుపకారిగానుండును. పైత్య మొనరించును. శొంఠిని జేర్చి నిమ్మపులుసుతో మర్దించి మాత్రిలు గట్టవలయును.

౨ పెప్పెరిమెంటుతైలము—ఇది రెండు మొదలు ౫ చుక్కలవరకు ఒకచుక్కకు ఒకఔన్సు నీళ్ళవంతు కలిపి యివ్వవలయును. కడుపునొప్పులు అజీర్ణములు దొలంగును.

3 చిట్టాముదము—(క్యాష్టరాయల్) ఇది వికారము పెట్టకుండా విరేచనముగావించును. గడ్డకట్టిన మలమును మెత్తపరచి విరేచనము గావించును. వాతమును బోగొట్టును. త్రాగలేనివారు అల్లపురసములో గాని చారులోగాని కలపి పుచ్చుకొనుచుందురు. పెద్దలకు ఒకటిమొదలు రెండుఔన్సుల వరకు బిడ్డలకు ౧ మొదలు రెండుదాములవరకు.

కార్బాలిక్యాసిడ్—ఇది శరీరమందు బొబ్బనుపుట్టించును పదిమొదలు యిరువది పాళ్లవరకు కొబ్బరినూనెలోగాని నువ్వులనూనెలోగాని కలపి లేపనమొనరించిన కాలినపుండ్లను గాయములను గజ్జిని చర్మరోగముల మాన్పును.

కర్పూరపుతైలము—(టర్పెంటైన్) ఇది బూసిన కళ్లనొప్పులు రొమ్ముపైనబూసిన గుండెలలోనొప్పి దగ్గునెమ్మదిం

చును కాళ్లు చేతులు చల్లబడినప్పుడు యిదిబూసిన వేడిగలిగించును. దెబ్బతగిలినప్పుడు కూడా పూయుచుందురు.

ఉక్కుదావకము—(స్టీలుడాప్సు) ఇది రక్తమును శుభ్రపరచి యధికముగావించును. స్త్రీలకు బహిష్టును క్రమముగా గావించును. రసము శక్తిని పాలిపోవుటవిని బోగొట్టును.

కుంపైబానూనె—(కుంపైబా) యిది యిరువది మొదలు అరువై చుక్కలవరకు పాలలోగాని పంచదారతోగాని లేక చలవమిరియాలు సురాకారము తేనె యీమూటితోగాని పుచ్చుకొనిన సెగ్గసెగలు హరించును. మూత్రద్వారము శుభ్రపరచును. కొందరు చెందినీ అత్తరుకూడా మిశ్రమము చేయుట కలదు.

రసభస్మము—(క్యాలమత్) ఇది చంటిబిడ్డల మాంద్యమును పోగొట్టును. పెద్దలకు సుఖసంకటముల నివారణజేయును. ఇది నల్లమందుతో కలపి మాత్రలొనరించి యిచ్చిన గర్భములో నిలచి పనిచేయును.

భేదిలవణము—(యప్సమ్ సాల్టు) ఇది సుఖముగా నీళ్ళ విరేచనములు గావించును. జ్వరములో చమటపట్టే మందులతోకిన్ని వాతరోగములలో విరేచన బద్ధముగా నున్నప్పుడును యీమందు యివ్వవలశినది.

శాంటోనైన్—దీనినే జంతునుతారమని వాడుచున్నారు. ఇది నులిపురుగులు క్రిములను బాపుటకు మిగుల ఉపయోగ

కరము. పంచదారతో కలపి యివ్వవలయును. ఇది పుచ్చుకొనినమీదట విరేచనమునకు ఆముదము పుచ్చుకొన వలయును. ఏలనన లోపల చచ్చిన పురుగులన్ను మలముద్వారా బాహ్యాగత మగుటకు.

మర్దనతైలము—కర్పూరము ఔన్సు ౧ సారాయము తో బాగుగా మర్దించి నువ్వులనూనెలో కలపి వేపనమొనర్చిన వాతనొప్పులు హరించును. కీళ్ళవాపులు విషరక్తము హరించును.

సోడాఉప్పు—ఇది వేడినీరుతో పుచ్చుకొనిన కడుపునొప్పి శూల హరించును. జీర్ణము కలుగజేయును. ఇది పంచదార పానకములో జేర్చి నిమ్మఉప్పుగాని నిమ్మపులుసుతో గాని కలపి పుచ్చుకొనిన దాహమునణచును. ఉష్ణముతగ్గించి జీర్ణము కలిగించును.

ప్రస్తుతము వాడుకలోనున్న యింగ్లీషు ఔషధములు.

ఆంటీ పిఫ్రియర్—జ్వరములకు.
పెయిన్ కిల్లర్—జ్వరములందు లోపలికిని పైకి పూయుటకును.
యూక్లిప్స ఆయిల్—సాధారణమైన జ్వరములకు.
జ్వరహరి—సమస్త జ్వరములకు అమృతాంజనం డిపో.
క్యునీన్—కొయినా తెల్లది మంచిది చలిజ్వరములకు.
శాంటోనైన్—(జంతుకుతారం) లోపలిక్రిములకు.
చాంబర్ వైన్—దగ్గులకు.

కాడ్లీవరాయల్
క్లిప్లర్ కాడ్లీవరాయల్ } బలమునకు రక్తశుద్ధికి.

కియూభార్క
మాల్కంగిణి } నంజు (శోఫ) వ్యాధులకు.

హార్లెస్
స్టెప్లర్సు
మిల్లెన్సు
బార్లెగంజి } ఇవి నిత్రాణిగా యున్నప్పుడు ఉపయోగించు దురు.

ఆస్పిరెక్ బిళ్ళలు—ఇవి తలనొప్పికి నీటితో బుచ్చుకొను చుందురు.

కాడ్లీవరాయల్—ఇది బలమున కుపయోగింతురు.

పర్మాంగ నేట్ ఆప్ పుటాసియం—ఇది వేడినీళ్ళలో జేర్చి రణ ములు పుండ్లు కడుగుచుందురు. కుళ్ళు బట్టనియ్యదు.

బాట్లీవాలా మిక్చరు—ఇది శీతజ్వర మన్యజ్వరములందు వాడు చుందురు. ఇందు మాత్రిలుకూడా గలవు.

కస్తూరిమాత్రిలు (స్వల్పకస్తూరిభైరవము)—పిప్పళ్ళు శుద్ధి జేసిన నాభి, జాపత్రి, పొంగించిన వెలిగారము శుద్ధిజేసిన యింగిలీకము మిర్యాలు కస్తూరి తక్కోలములు యివి అల్లపు రసముతో నూరి మాత్రిలు గట్టవలయును.

మహాకస్తూరిమాత్రిలు—శుద్ధిజేసిన యింగిలీకము తు ౦౹ రస కర్పూరంనిప్పుమీదపొగబోవునట్టు కాచినది తు ౦౹ జిట్టవరగోగు

తు ౦၊ రససింధూరం తు ౦၊ కుంకుమపువ్వు అణాలు ౨ శొంఠి తు ౧၊ మిర్యాలు తు ౦၊ పిప్పళ్ళు వేయించినవి తు ౦၊ కస్తూరి చి၊ ౧ గోరోజనము చి॥ ౧ జున్ను చి॥ ౧ పాదరసము చి॥ ౧ కొయ్యపీత (చేపచేదు) చి॥ ౧ ఆదిబచ్చికాని చి॥ ౧ యివికల్వ ములో జేర్చి వావిలాకు రసము మునగవేరు చెక్కరసము అల్లపురసము గుంటగల్గర రసము వీనిచే మర్దించి పెసలంత మాత్రలు గట్టవలయును. ఇవి సమస్తవ్యాధులకు బనిచేయును. చిత్రమూలాల సారముతో కూడా మర్దించుట మిగుల శ్రేష్ఠము

సన్నమాత్రలు—రసకర్పూరం రససింధూరం యింగిలీకం గోరోజనము ఆనందభైరవి జట్టవరగోగు యివి సమములు బాగుగా మర్దించి ఆవాలంతటి మాత్రల గట్టవలయును. ఇవి బాలులకు మిగుల ఉపయోగకరము.

—♦ విరేచనమాత్రలు (జ్వరఘణికరుడం) ♦—

చ. నాలుగు దారదంబు బలి నాభిరసంబులుమూడుపాళ్ళు నే
పాళము లేడుకూర్చి దగ మర్దనభృంగి రసంబుచేత నే
దూలకజేసి మాత్రికటుత్రయమునన్ యొసగంగనాహిక్వ
యే లవమాత్రముండవు ఖగేశ్వరమహా జ్వర సర్పజాతికిన్॥

(ధన్వంత్రీవైద్యలహరి రసాయనాది ప్రకరణము)—శుద్ధిజేసిన యింగిలీకం ౪ గంధకం ౧ శుద్ధనాభి ౧ పాదరసం ౧ శుద్ధిజేసిన నేపాళనములు ౭ యివి గుంటకల్గర రసముచే మర్దించి మాత్రల గట్టవలయును.

ఆనందభైరము—పిప్పళ్ళు మిరియాలు నాభి పొంగించిన వెలిగారం శుద్ధిజేసిన యింగిలీకం యివి సమములు. నిమ్మ పులుసుతో మర్దించవలయును. ఇది కనులలో బెట్టుటకుకూడా ఉపయోగించును.

ఆనందభైరవము మరియొక ప్రకరణము—శుద్ధిజేసిన యింగిలీకము వెలిగారము పొంగించినది నాభి మిరియాలు యివి సమములు వేపచక్క రసముతో మర్దించవలయును. ఇది జ్వరముల కుపయోగము.

లఘువిరేచనమాత్రలు—శుద్ధిజేసిన నేపాళపుపప్పు తు ౧ శుద్ధిజేసిన యింగిలీకం తు ౧ పచ్చిశనగపప్పు తు ౨ ఇవి ఆవు పులి మజ్జిగతో మర్దించి మాత్రలు గట్టవలయును.

## — స్వచ్ఛందభైరము. —

గీ॥ బలిరసంబులు నాభము తులముతులము
సగముజాజిఫలంబులు సర్వచూర్ణ
మునకు సర్ధము పిప్పళ్ళు దనరుతమల
పాకురసమున మర్దించి లోకమునను
బాయుకాసలుస్వచ్ఛంద భైరవంబు॥

## —ధన్వంతిరివైద్యలహరి—

గంధకము ౧ పాదరసము ౧ నాభి ౧ జాజికాయలు ౦ ౪ వేయించిన పిప్పళ్ళచూర్ణము ౨ ౪ యివి తమలపాకు రసముతో మర్దించి మాత్రిల గట్టవలయును. జ్వరములు అజీర్ణములు దగ్గులు మొదలగునవి నివారణ మగును.

హుతాశనరసము—గంధకం ౧ వెలిగారం ౧ నాభి ౩ శుద్ధిజేసినకపరి ౨ శంఖభస్మం ౧ ఆకాశధూళి (కరిధూపము.)౩ మిరియాలు ౮ యివి నిమ్మపులుసుతో మర్దించి మాత్రలు గట్టి యొసంగిన అజీర్ణము కడుపుబ్బురములు వాతములు మొదలగునవి హరించును.

సామాన్యకలికము—(అంజనము) పొంగించిన యింగువ శొంఠి పిప్పళ్లు మిరియాలు యివి సమభాగము పొడిజేసి వస్త్రగాళితమొనర్చి వేపాకురసము తుమ్మియాకురసము వీని చేత బాగుగా మర్దించి కణికలుగట్టి కన్నులవైచిన తలనొప్పులు శైత్యభారము నేత్రదోషములు హరించును.

శంఖద్రావకము—పటిక శె ౧ । సురేకారం శె ౦ ౪ — నవాసాగరం తు ౩ వెలిగారం తు ౨ సైంధలవణం తు ౩ సౌవర్చలవణం తు ౨ బిడాలవణం తు ౨ కాచలవణం తు ౨ సద్యక్షారం తు ౨ యవక్షారం తు ౨ సముద్రలవణం తు ౨ యివి ముంతలోబోసి పైనభట్టిజేర్చి చీలమన్నిచ్చి పొయ్యి మీఁదబెట్టి కమలాగ్ని మందాగ్ని గాఢాగ్నులచే వండిన ద్రావకము స్రవించును. శూలలు అజీర్ణములు పైత్యములు వీటిని హరింపజేసును.

మాజీఫల రసాయనము—మాజీఫలరసము నిమ్మపులుసు అల్లపురసం దానిమ్మపులుసు నారింజకాయలపులుసు యివి సమములు తేనెయిబ్బడిజేర్చి రసములింకువరకుమెల్లగా

గాచి దింపుకొనవలయును. ఇది పైత్యముల హరింపజేయుట యేగాక జిహ్వకు రుచినిబుట్టించును. ఆకలిగలిగించును. తేలు కుట్టినపుడు లోపలికిబుచ్చుకొనిన బాధశమించును.

అజీర్ణహరమాత్రిలు— సముద్రిలవణము నీటిలోకరి గించి బాగుగా వడియబోసి పొయ్యిమీద నీరిగురువరకు గాచిన స్వచ్ఛమగు లవణమగును. ఈలవణము తు ర చామంతి పూలు తు ర బాగుగా మర్దనజేసి మాత్రిలుగట్టి సేవించిన అజీర్ణములు శూలలు కడుపునొప్పులు పైత్యములు మొదలగు నవి నివారించును.

ఓమద్రావకము—ఓమము నూరుతులములు తగిన నీటిలోజేర్చి యాపాత్రను అయిదుదినము లూరబెట్టి ప్రతి దినముగల్పుచు పాత్రకు పైన నళికాయంత్రమునుజేర్చి మూసి చీలమన్నిచ్చి పాకముజేసిన గొట్టము మూతినుండి ద్రావకము స్రవించును. ఇవి అజీర్ణములుబాపును. సుఖవిరేచనమగును. కడుపునొప్పుల గట్టించును.

—♦ శీ తాం శు ర స ము ♦—

కం. మణిశిలతాళకములు సరి
గని కటు కత్రియముచూర కల్వమునిడి మ।
ర్దనజేయు వేపరసమున
దనరును శీతాంశురసము దండధరారీ॥

ధన్వంతీ్రివైద్యలహరి—మణిశిల ౧ తాళకము ౧ త్రికటుకములు (శొంఠి పిప్పళ్లు మిరియాలు) ౨ యివి వేప చక్కెర సముతో మర్దించవలయును. ఇవి శీతజ్వరములు మన్య జ్వరములు విషమజ్వరములు వాతములు మొదలగునవి హరింప జేయుచు.

వైష్ణవీరసము—కటుకరోహిణి నాభి శొంఠి పిప్పళ్ళు మిర్యాలు శుద్ధిజేసిన యింగిలీకము యివిచిత్రిమూలరసముతో నూరి ముద్దజేస చిత్రిమూల కషాయములో ముద్దనుగుడ్డలో జేర్చి వ్రేలాడగట్టి వండి తీసి నూరి కణిక లొనరించవలయును.

లఘుజ్వరహరమాత్రిలు—శొంఠి పిప్పళ్ళు మిరియాలు రససింధూరము యివిసమములు నిమ్మపులుసు అల్లపురసము వీనితోనూరి మాత్రిలుగట్టి యొసంగిన సామాన్యజ్వరములు హరించును. శుద్ధిజేసిన యింగిలీకముజేర్చిన మిగుల యుప యోగము.

శంఖభస్మము—శంఖము ముక్కలుగావించి నిమ్మ పులుసుతో మూడుదినములు సూర్యపుటము (ఎండలో) బెట్టి శుభ్రిముగా కడిగి మృత్తికాపాత్రిలలో జేర్చి చీలమన్నిచి వరాహపుటముబెట్టిన భస్మమగును. ఇది శూలలు అజీర్ణములు మొదలగునవి హరింపజేసును.

## —♦ పుటముల క్రమము ♦—

శ్లో॥ ప్రత్యేకం గోమయం పిష్ఠం కణిష్కంచ సమారభేత్।
కూర్మేచతుర్ధసంఖ్యాయాం కుక్కుటేదశసంఖ్యయా ౘ
వరాహేవింశతించైవ మహిషం శతమారభేత్।
గజపుటేనసహస్రేతు యిత్యే తేపుటలక్షణం॥

| | | |
|---|---|---|
| కూర్మపుటము | పిడకలు ౪ | గజపుటము ౧౦౦౦ |
| కుక్కుటపుటము. | ,, ౧౦ | |
| వరాహము. | ,, ౨౦ | |
| మహిషపుటము. | ,, ౧౦౦ | |

గవ్వభస్మము—తేనెవర్ణముగల గవ్వలు నిమ్మపులుసులోవైచి మూడుదినములు సూర్యపుటము (ఎండలో) బెట్టి కడగి మూకుళ్ళయందు జేర్చి చీలమన్నిచ్చి కుక్కుటపుటము బెట్టిన భస్మసగును. ఇది అజీర్ణములు శూలలు మొదలగు వాని నివారింపజేసును.

పగడభస్మము—పగడపుచూర ప్రమిదెలోజేర్చి నిమ్మపులుసుజేర్చి సూర్యపుటము మూడురోజులిడి బాగుగాకడగి ప్రమిదెలలోబెట్టి చీరమృత్తికమెత్తి కుక్కుటపుట మిడిన భస్మమగును. ఇది వేరిననేతితో సేవించిన దగ్గులు మానును.

కాసీస (అన్నభేది) సింధూరము—మంచి అన్నభేదిని నిమ్మపులుసుతో మర్దించి ఒకదినము సూర్యపుటమిడి పిమ్మట ప్రమిదలలోజేర్చి చీరమన్నిచ్చి ౧౦ పిడకలతో పుటము వేసిన

సింధూరించును. పిమ్మట దుష్టుపాకురసము జేర్చి ౫ పిడకలతో పుటముబెట్టుట మంచిది. ఇది క్షయలు దగ్గులు అజీర్ణములు పైత్యములు హరింపజేసును.

తాళిసాదిచూర్ణము—తాళిసపత్రి ౧౦ సొంఠి ౧ పిప్పళ్లు ౧ మిర్యాలు ౧ కరక్కాయలు ౧ ఉసిరికపప్పు ౧ తాడికాయలు ౧ ధనియాలు ౧ జీలకఱ్ఱ ౧ ఓమము ౧ కురాసాని ఓమము ౧ నాగకేసరాలు ౧ ఏలకులు ౧ చలువమిరియాలు౧ అతిమధురం ౧ జాజికాయ, జాపత్రి ౧ లవంగాలు ౧ సోపు ౧ చంగల్వకోష్టు ౧ గసగసాలు ౧ లవంగపత్రి ౧ ఇవి దంచి చూర్ణమొనరించి శర్కర జేర్చి పుచ్చుకొనిన పైత్యవాతములు ఉష్ణము పైత్యపుమంట పైత్యవికారము అన్నద్వేషము వాంతులు మొదలగునవి హరించును.

అశ్వగంధిచూర్ణము—శుద్ధిజేసిన పెన్నేరుగడ్డ ౬౪ శొంఠి ౩౨ పిప్పళ్ళు ౧౬ మిరియాలు ౮ ఏలకులు ౪ నాగకేసరాలు ౨ లవంగాలు ౧ ఇవి చూర్ణమొనరించి చక్కెర యిబ్బడిగలపి సేవించవలయును. మేహములు వాయువలు గ్రహణులు గాత్రము చిక్కుట మొదలగునవి హరించును. దారోష్ణ (అప్పుడు పిండిన ఆవుపాలు) తో సేవించిన పురాణజ్వరములు మొదలగునవి మాని పుష్టిగలుగును. పెన్నేరుగడ్డలు ముక్కలొనరించి ఆవుపాలతో వండిన శుద్ధియగును.

సుగంధపాలచూర్ణము—సుగంధపాలవేరు పట్టు ౧౦

తెల్లచందనము మానగపట్ట తెల్లబాడిసెపట్ట మద్దిపట్ట ముదివేప చెక్క నేరేడువేరుపట్ట మారేడు వేరుచెక్క ఇవి చూర్ణమొన రించి వెన్నతోగాని చక్కెరతోగాని సేవించిన నీరుచురుకులు తెల్లశగలు ఉష్ణములు మేహవ్రణములు ఇవి హరించును.

వల్లారాకుచూర్ణము—సరస్వతీ (వల్లారి) యాకు చూర్ణము ౧౦ లవంగాలు ౧ ఏలకులు ౧ జాజికాయ ౧ జా పత్రి ౧ మాచికాయ ౧ తాళిసపత్రి ౧ కరక్కాయ ౧ నెల్లి కాయ (ఉసిరిక) ౧ తాడికాయ ౧ ఇవి చూర్ణమొనరించి శర్కరజేర్చి నేతిలో సేవించిన మేహములు ఉష్ణములు గ్రంథులు కండ్లమంటలు క్షయలు నీరుచురుకులు హరించును. కంఠశుద్ధి గలుగును.

ఏలాదిచూర్ణము—లవంగాలు ౧ మిర్యాలు ౨ నాగ కేసరములు ౪ తాళిసపత్రి ౮ కూగైనీరు ౧౬ శొంఠి ౩౨ ఏల కులు ౬౪ ఇవి చూర్ణమొనరించి చక్కెరజేర్చి పుచ్చుకొనిన వాతపైత్యములు గ్రంథులు మేహవ్రణములు తీట విషరోగ ములు మానును.

కృష్ణాదిచూర్ణము—పిప్పళ్ళు అతివస తుంగముస్తలు కరకపువ్వు ఇవి సమములు చూర్ణమొనరించి తేనెగలపి నాకిం చిన బిడ్డలకు జ్వరాతిసారములు శ్వాస కాస వాంతులు హరించును.

పంచకోలచూర్ణము—పిప్పళ్ళు చవ్యము శొంఠి మోడి

చిత్రిమూలము ఇవి చూర్ణమొనర్చి సేవించిన దీపన పాచనములు గలుగుటయేగాక అరుచి మలబద్ధకము ప్లీహగుల్మ శూలలు హరించును.

యవక్షారాదిచూర్ణము—యవక్షారము అతివస కరకపువ్వు పిప్పళ్ళు పుష్కరమూలము వీనిచూర్ణము తేనెతోనాసగిన శిశువులకు పంచకాసలు హరించును.

శృంగాదిచూర్ణము—కరకపువ్వు అతివస పిప్పళ్ళు వీనిచూర్ణము తేనెతో నాకించిన శిశువులకు దగ్గు జ్వరము వాంతులు హరించును.

అజామోదాదిచూర్ణము—అజామోదము బూరుగుబంక అల్లము ఆరెపూలు దీనిచూర్ణము పెరుగుతో సేవించిన అతిసారములు గట్టును.

మరియొక తాళీసాది చూర్ణము—తాళిసపత్రి ౧ మిరియాలు ౨ శొంఠి 3 పిప్పళ్లు ౪ వెదురుప్పు (తవాక్షురి) ౫ ఏలకులు ౦౹ లవంగపట్ట ౦౹ ఇవి చూర్ణమొనరించి వంగ (తగర) భస్మము మిశ్రిమమొనరించి శర్కరతో బుచ్చుకొనిన రుచి అన్నపచనము గలుగుటయేగాక శ్వాసకాసలు జ్వరము అతిసార వాంతులు గట్టును.

పంచసమ చూర్ణము—శొంఠి కరకపిందెలు పిప్పళ్లు తెల్లతెగడ సౌవర్చ లవణము ఇవి సమములు చూర్ణమొనరించి

పుచ్చుకొనిన కడుపుబ్బురము అగ్నిమాంద్యము ఆమవాతము మూలవ్యాధి ఇవి హరించును.

బడబానల చూర్ణము—సైంధలవణము ౧ మోడి ౨ పిప్పళ్లు ౩ చవ్యము ౪ చిత్రమూలము ౫ శొంటి ౬ కరక పిందెలు ౭ ఇవి చూర్ణమొనరించి సేవించిన అగ్నిదీపనము గలుగును.

ముసలీచూర్ణము— నేలతాడిగడ్డలు తిప్పసత్తు దురద గొండివిత్తులు పల్లేరువేళ్లు బూరుగవేరుచెక్క ఉశిరకపప్పు వీని చూర్ణములో శర్కరగలపి నెయ్యి ఆవుపాలు వీని యనుపానముతో సేవించిన వీర్యపుష్టి గలుగును.

పిండతైలము—మంజిష్టి సుగంధపాల అందుగుబంక యష్టిమధుకము తేనెమైనము ఇవి సమములు కల్కమొనరించి ఆముదముజేర్చి కల్కము పాకమగుటకు నాలుగింతలు నీరుజేర్చి ఆముదము శేషించునటుల గాచి వడియగట్టి లేపన మొనర్చిన వాతరక్తము పరిశుభ్రమగును.

అర్కతైలము—పసుపుకల్క మొనరించి దీనికి తెల్ల ఆవాలనూనె నాలుగుసెరెట్లు నూనెకు నాలుగింతలు జిల్లేడాకుల రసముబోసి తైలపక్వమొనర్చి లేపన మొనరించిన గజ్జుకుపులు హరించును.

హింగ్వాదితైలము—ఇంగువచేదు సౌరఫలము శొంఠి నికల్కము గావించి నాలుగింతలు ఆవనూనె నూనెకు నాలు

గింతలు నీరుబోసి కాచి వడియగట్టు చెవిలోవైచిన కర్ణశూలలు హరించును.

లశునాదితైల్యము—వెల్లుల్లిరెబ్బలు. శొంఠి యింగువ ఇది తైలమందుజేర్చి కాచి చల్లార్చి చెవిలో వైచిన కర్ణశూలలు ధ్వనులు హరించును.

కేతకీతైలము—దేవదారు చెంగల్వకోష్టు పెన్నేరుగడ్డ జటామాంసి తుంగగడ్డలు యష్టిమధుకము జీలకర్ర లవంగములు లవంగపత్రి ఏలకులు నాగకేసరములు మంజిష్టి పసపు కస్తూరిపసపు కలువగడ్డలు రేణుకలు ముత్తువపులగము పిల్లిపీచర వట్టివేళ్ళు కురువేరు సమములు చూర్ణమొనరించి మొగలిచండ్లరసము, పాలు, నూనె, యివి సమముగాచేర్చి తైలము మిగులునట్లు గాచి భద్రపరచుకొనవలయును. శిరోఉష్ణములు మేహవాతములు మొదలైనవి మానును. మాడున యంటుకొనిన బాగుగా నిదురబట్టును.

భృంగామలకతైలము—గుంటకలగర రసము శేర్లు ర ఉశిరకపండ్లరసము ర ఆవుపాలు ర నువ్వులునూనె శే ౧ అందుకలువగడ్డలు యాలకులు లవంగములు ఆకుపత్రి భద్రముస్థలు గూళ పాలచాగగడ్డలు చెంగల్వకోష్టు మంజిష్టి తక్కోలపు ఉట్లు దేవదారు యష్టిమధుకము చందనము గొబ్బివేళ్ళు నాగకేసరములు కటుకరోహిణి వీనిచూర్ణమువైచి తైలపక్వముగా గాచి దింపుకొనవలయును. ఇది తలకంటుకొనిన శిరోవ్యాధులు

పార్శ్వపునొప్పులు వాతములు మొదలగునవి యన్నియు మానును.

మాడుపట్టుకు దినుసులు—యింగువ తు॥ నాభి తు॥ అవాలు తు ౧ ౨ నల్లమందు తు ౦। ముసాంబరం తు ౦। కటుకరోహిణి తు౦। వెల్లుల్లిపాయల రసముచే మర్దించి మాడునపట్టు వేసిన మైకములు త్రిదోషములు తలనొప్పులు సంగమదోషములు హరించును.

సామాన్యపుపట్టు—అవాలుపొడి మంచిగంధము గలపి మాడున కణతలకు పట్టువైచిన సామాన్యపు తలనొప్పులు మానును.

తలనొప్పులకు పట్టు—శొంఠి కచ్చూరము మిప్పికొమ్ము యివి వాయింటాకు పసరున సాదగంధము దీసి పట్టువేసి సాంబ్రాణి ధూపమువైచిన వంటికణత నొప్పులు తలనొప్పులు శిరోభారములు తప్పక మానును.

జిహ్వాగండూషము—ముత్యము పగడము రుద్రాక్ష లకలకట్టి పొంగించిన మడ్డి వెలిగారము శొంఠి యివి దొండకాయ రసముతోగాని దొరకనియెడ నిమ్మపులుసుతోగాని సాది గంధమును నాలుకపై బూసి బంగారపుతీగెతోగాని లభించని యెడల వేపపుల్లబద్దతోగాని గీచి వేడినీటితో పుక్కిలింపజేసిన జిహ్వాదోషము లణగును.

మరియొకప్రకరణము—యష్టిమధుకము చెంగల్వకోష్టు

కొంత వెలిగారము యివి నిమ్మపులుసు రసాదిగంధము దీసి దానిలో కొంచము తేనెజేర్చి నాలుకకు బూసి గండూషము జేయువలయును.

భంగుజేయువిధము—ఏడు పర్యాయములు బాగుగా కడగి పరిశుభ్రముజేసిన భంగుయాకు తు౦। జాజికాయ తు౦। మిరియాలుతు౦। గసగసాలుతు౦। సోపుతు౦। గుబిలాపూలుతు౦। యాలుకులు తు౦। నానబెట్టి పైపొట్టుదీసిన బాదంపప్పు తు॥ ౧ ముందు పైవస్తువులన్నియు నీటితో నూరి ఆకరున బాదంపప్పు చేర్చవలయును. పంచదార పానకముజేసి దానిలో పైవస్తువులు గలపి పాలుజేర్చి పుచ్చుకొనవలయును. ఇయ్యది కాశీప్రాంతములో వాడుక. విశ్వేశ్వరునికి భంగుభోగము జేయుటకలదట.

బాలింత విడియము—కస్తూరి గోరోచనము కుంకుమ పువ్వు రొయ్యపీత పావుదారుజున్ను జిట్టవరగోగు అక్కలకఱ్ఱ లవంగములు మిరియాలు ఇవి తమలపాకులోజేర్చి బీడీగాజుట్టి బాలింతలకు మూడుదినములు విడియముగా నొసంగిన గర్భ కోశము పరిశుభ్రమై వాతములు హరించును.

మోడికారము—స్త్రీలబాలవైద్య సుధాబ్ధిపుట 166

ఉ। పిప్పళులొక్కతూకములు పిప్పలిమూలము లొక్కసేరుగా
నప్పుడెవేచి దీపక మహౌషధులింపుగగొట్టి బెల్లమున్
దప్పక మాషపిష్టముఘృతంబును జేరిచి గల్పిముద్దలన్
నొప్పుగజేసి సూతికలు యోపికమెక్కవిధాన మానిలన్॥

పిప్పళ్ళు తు ౧ మోడి శేరు ఇవి వేయించి కొంచము ఓమము శొంఠి జేరిచి దంచి మినపపిండి బెల్లము నేయి ఇవిబోసి కలపి ముద్దలుజేసి నిత్య మొకటి రెండువంతున రెండుమాస ములు భక్షించిన వాతమును బోగొట్టి అగ్నిదీపన మొనరించి బాలింతల కాపాడు చుండును. ఈవిధమమున కొందరు మినప పిండి అపథ్యకరమని జేర్చరు.

విషప్రీతి విషమములు—స్త్రీ బాలవైద్య సుధాబ్ధిపుట 16

సీసమాలిక

ఓట్ర్రివేళ్ళరసంబు శీఘ్రింబుగానిడ సర్వవిషంబులు సమ సిపోవె। ఆరతికర్పూర మహికాటులకుబెట్ట విషమునువెలిబుచ్చి విమలపరచు। సర్పాక్షికల దినసారంబుగ్రోలిన బాయునువిష ముల బాధలన్ని। పసపుపచ్చిది ధేను పాలలోనిడిగాచి ద్రాగిన గరళము దగ్ధమగును। గన్నేరుబాధకు కరకఫలంబులు జెల్లు మోదుగుపువ్వు బీడికెలమి। తేనెకాజ్యములకు పానీయములు జాలు గర్పూరమునకు గల్గ రాకు। దూలించుజీడిని దూలగోనె లవారి జివ్కుతమ్మలముకు జింతపండు। పసపుమొక్కగ చింత పండుకుమేలగు బెరుగుకువేడ్నీరు యురగభూష।యుమ్మెత్తవిత్తు లకిమ్మగుతామర చూరనిమ్మరసంబు శుభ్రపరచు। తైలికపిం డికినూనె తిప్పరసంబగు సున్నంబుననుగల్గు సొక్కుబాప।చక్క నటుకులకును సైంధలవణము దూలించుదెగడను దుమ్మచెక్క। అరుగనిసాదంబుకగు నావచూర్ణము పనసఫలంబుకు బరగు

సీ॥ పెరుగువంటకమును బెట్టనౌనాభికి బసపుసున్నముకగు
బాధదీర్చు । త్రాగనౌ కందకు నాగవల్లిరసంబు పాషాణజాతికి
బ్రత్తిగింజ । బేస్మి కొబ్బరికిని బియ్యంబు దినవగు నల్లమందును
సాంత్వి తుత్రిళ్ళశాచు । గీ॥ అనుములకు జెల్లుగంధంబు దనరురస
ము । లకును గంధకమొప్పును బ్రకటితముగ । బంగరిప బ్రతి
విషములు బరగునిట్లు । భూతగణనాథ గజచర్మ భూ[illegible]త్రాంగ॥

షర్బతులు—ఆయారసములను తెల్లచక్కెరతోఁజేర్చి సన్ననిమంటపై తేనె పక్వముగా గాచి దింపుకొని గాజు పాత్రలో భద్రపరచుకొన వలయును.

సుగంధిపాల షర్బతు—సుగంధిపాలవేరు పొట్టు గిం ౫౦ తులములు రోజాపూలు యెండువి తుగ్గ, నాగకేసరములుతు ౯, ఏలక్కాయలు తు ౯, శొంఠి తు ౦ ।, తాళిసపత్రి ౦ । జాపత్రి ౦ ।, లవంగపత్రి ౦ ।, చల్లగడ్డ తు ౨, ఇవి నలియగొట్టి అరపడి నీటిలోవైచి ఒకరాత్రి నానబెట్టి మరునాడుకాచి చాతుర్భాగముగా దించుకొని ౩౦ తులముల చక్కెరజేర్చి తేనెపాకముగా గాచి దింపుకొన వలయును. పూటకు తులము న్నర చలినీటితోఁగాని కాచిన ఆవుపాలతోఁగాని పుచ్చుకొన వచ్చును. అత్యుష్ణము, తాపము, మోహము, పైత్యవికారములు మానును. ఎండినసుగంధిపాలపొట్టుకూడా పనికివచ్చును.

దానిమ్మపండ్ల షర్బతు—పుల్లదానిమ్మపండ్ల రసము ౨ పాళ్ళు, తెల్లచక్కెర ౧ పాలు యివికాచి దింపుకొన వల

యును. వాంతులను, విరేచనముల గట్టించును. అన్నాశయము నకు బలమొసగును.

జంబీరాది షర్బతు—నిమ్మపులును, ఉన్నాబ్ పండ్ల రసము, బేరికాయల రసము, పుల్లదానిమ్మరసము, తియ్యవా నిమ్మ రసము, యీరసములు ర ఫలములచొప్పున మొకటిగా జేర్చి తెల్లచక్కెర ర ఫలములువైచి సన్నని మంటపైగావి ఒకపొంగు రాగానే దింపి వడియగట్టి అగరుచెక్క—చూర్ణము, పిస్తాబరడు పొడును ఇవి దినుసుకు అరవరహాయెత్తు కల్వ ములో బాగుగానూరి వస్త్రగాళిత మొనర్చి రూమిమస్తకి చూర్ణము వరాయెత్తు, ఇవివైచి షర్బతుగా కాచి దించుకొన వలయును. ఇది సేవించిన పైత్యము, కాక, అరోచకము, విష జ్వరము, శరీరమంటలు యివి మానును.

మాదీఫల షర్బతు—మాదీఫల రసము ఫ ర, గావుజు బాన్ ద్రావకము ఫ గ, తెల్లచక్కెర ఫ గ, కుంకుమపువ్వు పావువరాయెత్తు. ముందు గావుజుబాన్ ద్రావకములో పంచ దారవైచి నురుగు పోవువరకుకాచి పాకమువచ్చు సమయమున మాదీఫల రసమునుజేర్చి కలపి రెండుపొంగులు రాగానే దింపు కొన వలయును. అన్నాశయమునకు బలమిచ్చును. పైత్యము, ఉష్ణము నివారణచేయును.

గసగసాల పాయసము—గసగసాలు ఒకతులమునూరి ముద్దను గుడ్డలో మూటగట్టి కాలుపడి నీటిలో వైచి, ముద్దయం

తయు గిరగునటుల బిసికి, వడియగట్టుకొని, మూడుపొంగులు వచ్చునట్లుగాచి ౧౦ ఫలములు తేనె జేర్చి కాచి దించుకొనవలయును. రక్తవృద్ధి, శరీరపుష్టి గలిగించును. కాక, దగ్గు వీనిని బోగొట్టును.

గాజరగడ్డ పాయసము—ఎఱ్ఱముల్లంగిగడ్డను చర్మముచివ్వి గట్టిభాగమును బాపి కందిబేడలవలె చిన్నముక్కలు తరిగి నది ఫ ౩౻. ఈముక్కలు కొంచము నీరుపోసి వుడికి ముక్కలను దీసికొనవలయును. పిమ్మట కలకండను పాకము బట్టియుంచి బాదముపప్పు ఫ ౩౻, బియ్యము ఫ ౩౻, ప్రత్యేకించి నూరి పాలనుపిండికొని రెంటినికలపి కాచి యర్థపుంకీన మీదట గాజరగడ్డ ముక్కలనువైచి పొంగు రాగానే కలకండ పాకముగలపి పాకముగా దించుకొనవలయును. దేహమునకు కాంతియు, రక్తవృద్ధి, ధాతువృద్ధి గలిగించును. ఉదయమున తు ౧౻ వంతున పుచ్చుకొనుచుండవలయును.

అల్లముమురబ్బా. ధన్వంత్రీవైద్యలహారి పంచమవీచి.—

గీ॥ బొట్టుదీయుచు నల్లము బొడచి రంధ్ర
ములను జలములనుడికించి గలపి తేనె
పంచదారల పాకంబుబట్టి జేర్చ
నల్లముమురబ్బ పైత్యాము లణచు దేవ॥

నారికేళ రసాయనము—పచ్చికొబ్బరిసారము భా ౩౨ కలకండ ౨౪, శొంఠి ౧౬, నెయ్యి ౨౦, ఇవి కుండలో జేర్చి పాక

ముబట్టి కరక్కాయ భా ౧, తాడికాయ భా ౧, ఉసిరికవరుగు భా ౧, నాగరముస్థలు ౧, నాగకేసరములు ౧, ఆకుపత్రి ౧, జీలకర్ర ౧, గజపిప్పళ్ళు ౧, దాల్చినపట్ట ౧, ధనియాలు ౧, పిప్పళ్ళు ౧, ఏలకులు౧, తవాక్షీరి ౧, వీనిచూర్ణము జేర్చి తేనె ౩౦ జేర్చి కలియబెట్టి దింపుకొనవలయును. దీనిని సేవించిన ఆకలి బుట్టించును. శూలలు, ఛర్దులు, హృద్రోగములు వీని బాపి వీర్యపుష్టి యొసంగును.

నాగరముర బ్బా—మంచిశొంఠి కుండలో వైచి యిసుక బోసి నీరునిండించియిరువది దినములూర బెట్టి పైకొని కడగి వాడి శలాకుచే రంధ్రములు జేసి తేనె, నీరు జేర్చి నీరింకువరకు గాచి శొంఠిముక్కలు బడవైచి దింపుకొని గాజుపాత్రియం దుంచు కొనవలయును. మూత్రబంధము, అజీర్ణము వీనిని దొలగించి ఆకలి బుట్టించును.

మాషాదిమోదకము—మినపపప్పు ఫ ౧, గోధుమలు ఫ ౧, యవలు తు ౧, వాయువిడంగములు ఫ ౧, ఇవిచూర్ణ మొనరించి పంచదార ఫ ౪, నీరు ఫ౨౦లు పాకముబట్టి నెయ్యి ఫ ౨ జేర్చి పైవస్తువుల పిండినిజేర్చి కలపి ఫలపరిమాణ మోదకము లొనరించి భక్షించు నాలుగుఫలముల ఆవుపాలు త్రాగిన మిక్కిలి సంభోగశక్తి గలుగును. పులుసు కారము వీని విడువవలయును.

పచ్చళ్ళు (చట్ని)—పచ్చివంకాయలు ముక్కలుగా తరిగి తగినట్లు ఉప్పుజేర్చి త్రొక్కి కుండలోబెట్టి మరునాడు విత్తులుదీసిన చింతపండు, పండుమిరపకాయలు, కొంచము పసపుజేర్చి త్రొక్కి మరల కుండలోబెట్టుకొని యుపయోగించు కొనవలయును. లేతకాయలైనయెడ పథ్యకరము.

ఉప్పుగోంగూర—పైరగోంగూర వేయించి ఉప్పుజేర్చి త్రొక్కి పిమ్మట పండుమిరపకాయలు, కొంచము పసపు జేర్చి త్రొక్కి యూరబెట్ట వలయును. ఇది సంవత్సరము మించినవి పథ్యకారి. దీనిని నూనెతో బెట్టుటయు కలదు.

చింతకాయపచ్చడి—దోరబండిన చింతకాయలు తగినంత ఉప్పుజేర్చి త్రొక్కి ఊరబెట్టవలయును. ఆరునెలలకు పైగా ఊరిన పచ్చడి పథ్యకరము. ఇదినూరి తాలింపు నూనె యింగువులతో కాచిబెట్టిన రుచికరముగా నుండును. జ్వరితులకు ఆముదముతాలింపు మంచిది. ఇది పప్పులోజేర్చి వండిన పథ్యమునకు బనికివచ్చును. లేక నీటిలోబిసికి, పిండి, అందు వేయించు మిరపకాయలు కాలిచి జేర్చి కొంచము బెల్లమువైచి పచ్చిపులుసుగా నుపయోగించుకొన వచ్చును. ఇష్టమున్నచో నీరుల్లిముక్కలు జేర్చుకొన వచ్చును.

ఉసిరికపచ్చడి—ఉసిరిక కాయలు దంచి, లోపలి గింజలను తీసివైచి తగినంత ఉప్పుజేర్చి మరలత్రొక్కి ఊరబెట్టవలయును. పచ్చిమిరప కాయలుజేర్చి యూరబెట్ట వచ్చును. దీనినే

నల్లపచ్చడియని వాడుచున్నారు. దీనినినూరి మరల తాలింపు బెట్టి భక్షించిన పైత్యముల నణచును. జీర్ణశక్తి గలిగించి నోటి అరుచి బాపును. మిగుల పథ్యకరము.

రేగుబండ్లవడలు—మంచి రేగుబండ్లు తగిన ఉప్పుతో త్రొక్కి, వడలుగా జేసి. బాగుగా యెండించి భద్రపరచవలయును. ఈవడలు కావలసినప్పుడు నీటితోనూరి తాలింపుబెట్టి వాడుకొన వలయును. రుచిగలిగించి అజీర్ణముల బాపును పథ్యకరము.

అల్లపుపచ్చడి—మిరపకాయలు నేతిలో వేయించి, అల్లముముక్కలుకూడా కొంచము వెచ్చజేసి, వేయించిన మిరపకాయలు అల్లపుముక్కలు కొంచము పాతచింతపండు రోటిలో వైచి పచ్చడి నూరవలయును. ముందు అల్లమునూరి, స్వరసము దీసి తేరబెట్టి, పైన తేటవంచుకొని సత్తు దీసివైచిన రసము జోసి నూరిన మిగుల శ్రేష్ఠము.

కొత్తిమిరిపచ్చడి—సన్నగా తురిమిన ధనియాలాకు (కొత్తిమెర) తు ౨, మిరపకాయలుతు ౧ ౪, ఆవాలు ౧ ౪, మినపపప్పు తు ౨, జీలకఱ్ఱ తు ౦ ౹, యీ గిన్నె మంచినూనెలో వేరు వేరుగా వేయించి అంతాకలుపుకొని చింతపండు తు ౧ ౪, ఉప్పు తు ౧, యివిజేర్చి పచ్చడిగా నూరవలయును. పెసలువేయించి రోటిలోవైచి ఉప్పు నిమ్మపులుసుతో నూరి

యింగువజేర్చిన తాలింపు బెట్టవలయును. యిది రుచ్యము కొద్దిగా పథ్యము

దోసకాయపచ్చడి—చిన్నదోసకాయలు సెగలో మగ్గనిచ్చి లోపలివిత్తుల దీసివైచి రోటిలోవైచి వేయించిన మిరపకాయలు కొంచము పాతచింతపండుజేర్చి నూరినపథ్యకరము. పాతపచ్చడిలో కరివేపాకుగాని కొతిమెరగాని వేయవచ్చును.

వేపపూత—వేపపూతవేయించి పాతచింతపండు పులుసులోవైచి తాలింపుబెట్టవలయును. అలవాటున్నవారు పులుసులో బెల్లము కలుపవలయును. పిమ్మట తాలింపుబెట్టవలయును. ఇదియు పథ్యకరము. కొంచెమువేడిచేసి తగ్గును.

నారింజకాయ (దూదిదబ్బ) పచ్చడి—వేయించిన మిరపకాయలు తగినఉప్పు నారింజబద్దలలోజేర్చి పచ్చడినూరి భక్షించిన రుచిగానుండును. పథ్యకరము. రక్తవృద్ధిగావించును. తాలింపు బెట్టవచ్చును. పచ్చిమిరపకాయలతో నూరుట అపథ్యకరము.

నిమ్మకాయపచ్చడి—వేయించిన మిరపకాయలు ఉప్పు నిమ్మబద్దలు నూరి తాలింపు బెట్టవలయును. ఇది రుచినిబుట్టించును. పైత్యముల నణచును.

కేగుబొడ్లపచ్చడి— మంచికేగుఫలములు వేయించిన మిరపకాయలు ఉప్పు యివినూరి తాలింపుబెట్టి భక్షించవలయును. పథ్యకరము. నోటి అరుచిబాపును.

పెసలపచ్చడి — పెసలు వేయించి రోటిలోజేర్చి వేయించిన మిరపకాయలకారము నిమ్మపులుసు యివిజేర్చి నూరి తాలింపు బెట్టవలయును. ఇదిపథ్యకరము.

కొబ్బరిపచ్చడి — లేతకొబ్బరి తురిమి మెత్తగా ఉప్పునూరి కలపి పెరుగుజేర్చి కొంచెముపసపుగలపి తాలింపుబెట్టవలయును. వేయించిన మిరపకాయలు, కొంచెము వెచ్చజేసిన కొబ్బరితురుము, ఒకింతచింతపండు, ఉప్పుజేర్చి నూరి తాలింపు బెట్టవలయును. ఇది అంతపథ్యకారిగాదు.

వెలగకాయపచ్చడి — వేయించిన మిరపకాయలు ఉప్పుజేర్చి వెలగగుజ్జు నూరవలయును. ఇదిపథ్యకరము. వెలగగుజ్జు పచ్చిమిరపకాయలు ఉప్పు పెరుగు జేర్చి నూరి పసపువైచి తాలింపు బెట్టవలయును.

చింతపొట్టుచారు — చింతపొట్టను చూర్ణముజేసినీటిలో వైచిగాచి కొంచెము లవణముజేర్చి ఆముదము తాలింపుబెట్టిన పథ్యకరము.

నిమ్మకాయచారు — నీరుబాగా మరగగాచి తగినంత నిమ్మపులుసుజేర్చి లవణమువైచి ఆముదము తాలింపుబెట్టిన పథ్యకరము.

చారుగాయువిధము — ఒకశేరు మిరపకాయలు రెండు తులముల మంచినూనెజేర్చి వేయించి కారముగొట్టి యుంచవలయును.

ధనియాలు తు ౩౽, మిరియాలు తు ౧౨, జీలకర్ర తు ౩, మెంతులు తు ౧ ౪, ఆవాలు తు ౧ ।, యివి వేరు వేరుగా వేయించి పొడుములు జేసి పెట్టుకొనవలయును. ఇది యీచారు పొడి. ఎనిమిదిదినములవరకు బదికివచ్చును. ఆపైన రుచితగ్గిపోవును. మంచినీరు శే ౮ కాగబెట్టి అందుకందిపప్పు శే ౪ నెయ్యి లేక మంచినూనె తు ౧, పసపు తు ౦।, యివి బిసికి కాగుచూయుండె నీటిలో వైచి పొంగువచ్చినమీదట నీరుగల పాత్రమూతబెట్టి క్రిందికి దింపవలయును.

కళాయిపాత్రలో చింతపండు, తు ౽ నీరుజేర్చి బిసికి సెగనుబెట్టి తగినంత ఉప్పుజేర్చి పై పొడులను ప్రమాణముగా జేర్చి కొత్తిమెర కరివేపాకు యివిజేర్చి గాచి, దింపియుంచిన కట్టును గలపి కొద్దిగా కారమువైచి యింగువనీటిలో గాగించి యానీటిని మిశ్రమమొనరించి తాలింపుబెట్టి దింపుకొనవలయును. కొందరు దింపునపుడు కొద్దిగా బెల్లము వైచుటకలదు. ఇదిపథ్యకరము. గోరువెచ్చనగానుండు చారువాడుట శ్రేష్ఠము.

సీమచింతపండు—(ఆల్ బకారా) చారు ఆల్ బకారా ఫలములతో పథ్యమునకు కొందరు చారు బెట్టుచున్నారు. చింతపండుకు బదులు ఆల్ బకారా చేర్చి తక్కినవి చారుగాయునట్టి పద్ధతులతోనే సిద్ధముజేయవలయు. యీఫలమును జ్వరితులకు నోటిఅరుచిగా నున్నప్పుడు, పైత్యపునీరు నోటవెడలుచున్నపుడు ఉపయోగించుచుందురు.

ఊరుగాయలు—అరటిఊచ బిళ్ళలు తరిగి నిమ్మపులుసు, ఉప్పు కారముచేర్చి ఊరబెట్టి వాడుకొనుచుందురు. ఇది మహాశాంతి.

నిమ్మకాయ ఊరుగాయ— నిమ్మకాయలు నాలుగు పక్షములుగా తరిగి ఉప్పుకారముచేర్చి ఊరబెట్ట వలయును. ఆసమయములో సిద్ధముకావలయుననిన సన్ననిసెగపై మట్టి పాత్రిలో నుడికించిన వెంటనేసిద్ధమగును.

దబ్బకాయ ఊరుగాయ—దబ్బకాయలను ముక్కలుగా గోసి తగినంతకారము తగినంత యుప్పుజేర్చి సన్ననిసెగపై చర్మము మెత్తపడువరకు నుడికించిన తాత్కాలిత భక్షణము నకు సిద్ధమగును. ఈపక్వపు ఊరుగాయలు వారము దినముల కంటె నధికముగా నిలువ నేరవు.

పచ్చిమిరపకాయ ఊరుగాయ—పచ్చి మిరపకాయలు నడిమికి చీల్చి ఉప్పుమెత్తగా నూరిపైచి పెరుగుజేర్చి యూర బెట్టుదురు. ఇవి పచ్చివి వాడుటగాక ఎండబెట్టి భద్రపరచి అవ సరమున్నపుడు నేతిలోవేయించి భక్షించుచుందురు. పథ్యము నకుగానలసిన ఆముదములో వేయించుటయుంచిరి.

దోసకాయ ఊరుగాయ—దోసకాయ బద్దలుగా తరిగి ఉప్పు కారము తగినటుల చేర్చి ఊరబెట్టి వాడుకొనుచుందురు. కొందరు ఆవపిండి నువ్వులనూనె గలపి ఆవకాయ జేయుటకలదు. ఇది అపథ్యకరము. నూనె ఆవ లేకుండ ఊరబెట్టిన ఊరుగాయ

ను బాగుగా నెండించి భద్రపరచి అవసరమున్నపుడు నేతిలో వేయించి భక్షించుచుందురు. ఆముదములో వేయించిన పథ్యమునకు బనికివచ్చును.

వడియాలు—వరిపేలాలు శే ౧, యివిఒక శేరు నీటిలో నానబెట్టి పిమ్మట బుట్టలో వేసి నీరువడియగట్టి కళాయిపాత్రలో వైచి కారపుపొడి తు ౧ 4, తెల్లనువ్వులు తు ≡, యివి పేలాలలో వైచి పిసికి వడియాలు పెట్టవలయును.

వడియాలకు కారపుపొడి సిద్ధముజేయవలసిన విధము.

ఇంగువ తు 3 పొంగించవలయును, ఉప్పు తు ౨౮, మిరపకాయలు తు ౧౨, యివి దంచి పొడుము జేసికొనియుంచి తగినట్లు యీపొడిని వడియాలలో జేర్చుకొనవలయును.

బూడిదెగుమ్మడికాయ వడియాలు—పేలాలు శే౧ యివి నీళ్లలో నానబెట్టి వడియవేసి బూడిదెగుమ్మడికాయ తు౧౮, విత్తనములు పైచర్మము దీసి తురిమి తురిమినదానిని చక్కగా నీరుపిండి పేలాలతో జేర్చి పైజెప్పిన కారపుపొడి తెల్లనువ్వులు తు ≡ కలపి బాగాపిసికి వడియములుబెట్టి యెండించి సమయమువచ్చినప్పుడు నేతిలో వేయించి వాడుకొనవలయును. పథ్యమునకు కావలసిన నువ్వులు చేర్చకూడదు. ఆముదములో వేయించవలయును.

నల్లేరువడియాలు (వజ్రవల్లి)—లేతనల్లేరు తునకలు జేసి నానబెట్టిన పులవపప్పుతోగాని మినపపప్పుతోగాని రుబ్బి పైచెప్పి

నకారముజేర్చి వడియములు బెట్టవలయును. పథ్యమునకు గావ
సిన ఉలవపిండితో బెట్టినవి యుత్తమము. ఇవి నంజులు దగ్గులు
గలవారికి మిగుల పథ్యకరము.

బూడిదెగుమ్మడికాయ వడియాలు మరియొకవిధము.
బూడిదెగుమ్మడికాయపై చక్కతీసి సన్నగా ముక్కలుజేసి
బాగుగా నిరుపిండి, నానబెట్టిన వులవపప్పు జేర్చి రుబ్బి పైజప్పిన
కారముజేర్చి కలపి వడియములు బెట్టవలయును. ఇవి పథ్య
కరము.

నల్లేరు అప్పడములు—నల్లేరు తు 3 చక్కగా దంచి
నీళ్ళలోవైచి పేరిననెయ్యి తు 3 జేర్చి పొయిమీదబెట్టి యుడి
కించి, మినపపిండి శే 4, పైసిరును పిండిలో జేర్చి వడియాలకు
జెప్పబడిన కారమును తగినంతజేర్చి ముద్దజేసి కొంచెమునూనె
బూసియుంచి మరునాడు ఆముద్దను మెత్తగాదంచి అప్పడము
లను చేయవలయును. మినపపప్పు బాగుగా పొట్టులేకుండ
చేయవలయును.

పెసరఅప్పడములు—పెసలు ఆముదముగాని నూనె
గాని జేర్చి పిసికి బాగుగా నెండబెట్టి విసరి చెరిగిన, పైపొట్టు
యూడి తెల్లనిపప్పుగానగును. ఈపప్పును విసరి పిండజేసి, లేగి
నన్నిమిరపకాయలు నీటితోనూరి సారము పిండుకొని, ఉప్పు
నీటిలో కరగించి, యింగువనానబెట్టి నీటిలో కరగించి, యీనూ
టిని కలపి పైపిండిలో జేర్చి ఘట్టిగా కలపి ముద్దజేయవలయును.

కలుపునపుడు చేతికి అంటకుండా చేతులకు నూనెగాని నెయ్యిగాని బూసికొని కలుపవలయును. ఈకలపినపిండిని చిన్నచిన్న ఉండలుజేసి అప్పడాలుజేసి నీడను ఆరబెట్టినవలయును. ఇవి నిప్పుపై గాచి నేయిగాని మంచిఆముదముగాని బూసి అన్నములోజేర్చుకొని భక్షించవచ్చును. ఇవి పథ్యకరము.

పెసరట్లు(దోసెలు)—కొద్దిగాపొట్టుతో కూడిన పెసరపప్పును నానబెట్టి వడియవేసి రోటిలోవైచి కొంచము ఉప్పు అల్లపురసము కొద్దిగా మిరియములుజేర్చి రుబ్బి కొంచెము పసపువైచి కలపి, పెనము పొయ్యిమీదబెట్టి ఆముదముబూసి అట్లుపోయవలయును. ఇవిపథ్యకరము. పచ్చపెసలు శ్లేష్మమని కొందఱిమతము.బుడ్డబుడసరయాకు జేర్చి రుబ్బిన పైత్యహరము. బాగుగా చల్లారినమీదట తేనెబూసి భక్షించిన పైత్యాహరము నోటి యరుచి బోగొట్టును.

రసాల—స్త్రీబాలవైద్యసుధాబ్ధి 36

గీ. పెరుగు నరచేటిలోచిల్కి మిరియములను
శొంఠిలవణము శర్కర సారదిజేర్చ
నది రసాలగ నొప్పును నమితశుక్ర
వృద్ధిజేయుచు తనుపుష్టి నిచ్చుదేవ॥ స్పష్టార్థము.

అన్నము—

గీ. అగ్నిశొంఠ్యాది వరకషాయములతోడ
సిద్ధపరచిన యన్నము శ్రేష్ఠమగును
లఘువుగానుండు మరి తండులములు వేచి
వండ మిక్కిలి తేలిక నుండు దేవ.

అగ్ని=చిత్రమూలము। తండులములు=బియ్యము తక్కినది సుగమము.

మండము—స్త్రీ. వై.

గీ. వడ్లపేలాలు దానిమ్మబరడు శొంఠి
పిప్పళులు నీటిలోవైచి పక్వగాచ
మండమనబడు వాతము గండడంచు
నగ్నిదీపన మొనరించు నార్యపోష.

పేయ—స్త్రీ. వై.

కం. వరిపేలంబులు నీటిలో
కరమొప్పగవైచి మెల్లగా గాయంగన్
ధరణిన్ జెల్లును పేయగ
సుపూజితవిశ్వనాధ సుందరగాత్రి.

యీపేయలో శొంఠి సైంధవలవణము ధనియాలు చేర్చి కాచుకొనవచ్చును. ఇది జ్వరితులకు పథ్యకరము వాంతులు గట్టించును.

కం. నిర్మలతేజపరాత్పర
కర్మాఖిలదూర నిర్వికల్పచిదాత్మా
నిర్మాధర్మవిచక్షణ
నిర్మోహా నిష్కళంక నిగమస్తుత్యా.

గద్యము.

ఇయ్యది వైశ్యకుల పారావార రాకానిశాకర శత్రువర్గ భీకర
కౌండిన్యసగోత్ర పవిత్ర సుజనమిత్ర బసవయసుబ్బాం
బాప్రియపుత్ర కంకిపాటి తాతయార్య సు
మాంబాసహిత బంధుజనాప్త
వెంకటసుబ్బరాయగుప్తవిరచిత
అనుభవ గృహవైద్య
గ్రంథమున ద్వితీయ
సోపానము.







ఓమ్

శ్రీమద్ధన్వాన్తర్యైనమః.

# అనుభవగృహవైద్యము.



## తృతీయసోపానము.



క. శ్రీపరమేశ్వర సద్గుణ
దీప సర్వాంతరాత్మ దీన సుపోషా
తాపసవందితపాదా
పాపౌఘవిదూర దివ్య పావనమూర్తీ.

ఈగ్రంథము గృహవైద్యమున కనుకూల మగునట్లు వ్రాయబడినది. గనుక గృహస్థులు నాడీవిధానమున రోగనిర్ణయ మొనర్చుట దుర్లభము. వైద్యశాస్త్రము లపారముగా బఠియించినవారికే కష్టముగానున్నదిగాన నాడీవిషయ విచారణము కేవలము సూక్ష్మజ్ఞాన ముండినగాని యలవిగానేరదు. సామాన్య వ్యాధులకు వైద్యుని సహాయము లేక గృహస్థులాచరించు కొనుటకు ముఖ్యవిధులను దెలుపుచున్నాడను.

నాడీపరీక్ష—వాత పైత్య శ్లేష్మ నాడులను, మిశ్రమ నాడులను కొంతవరకు శోధనజేసిన కనుగొనవచ్చును. తర్జని మధ్యమ అనామిక వ్రేళ్ళయందు వాత పైత్య కఫములు వరుసగా నడచును. అనగా మణికట్టు మొదలు వాతనాడి, తదుపరి పిత్తనాడి, ఆమీద శ్లేష్మనాడి నడచును. రెండు వ్రేళ్ళక్రింద నడచిన ద్వంద్వవ్యాధిగా దెలిసికొనవలయును. పురుషులకు కుడిహస్తమందును, స్త్రీలకు ఎడమచేతియందును నాడి జూడవలయును పసిబిడ్డలకు నాడి సూక్ష్మముగా నుండుటచే మూడువ్రేళ్ళ క్రిందకుండును. నాడిపరీక్షించిన లాభములేదు. శరీర ఉష్ణమును బట్టి గ్రహించవలయును. సామాన్య ఉష్ణమునకు వారికి చికిత్సలు చేయకూడదు. వారికి మాటిమాటికి జ్వరము వచ్చుట గలదు. దాని కదియే ఉపశమించుచుండును. నిసువుల వ్యాధులకు తల్లులే కారణభూతులగుటచే వారు పథ్యపానాదులందు జాగరూకతగలిగి యుండవలయు. కూనలు మందుద్రావుట కష్టతరముగా నున్నయెడ ఔషధమును చన్నులకుబూసి పాలు గుడుపుట సుకరము.

లంఘనములు.

గీ. వాతపిత్త కఫజ్వర వ్యాధులందు
నొప్పు లంఘనములు మూడు నుపవసించి
యుంట లఘుభోజనముచేత నుంట గంజి
ద్రాగియుండుట పరమౌష ధంబు మేశ.

స్త్రీబాల వైద్యసుధాబ్ధి ప్రథమ వీచి పు ౫౭.

వాత పైత్య శ్లేష్మ తారతమ్యములచే లంఘనములు మూడువిధంబులు. వాతజ్వరపీడితుడు కేవలము నిరాహారిగా నుండవలయును. పిత్తజ్వరితుడు లఘువుగ భుజించవలయును. కఫరోగి పలుచని గంజి త్రాగవలయును. లంఘనములవలన ఆమము దొలగి అగ్నిదీపన గలుగుటచే శ్రేష్ఠతమము. కావుననే "లంఘనం పరమౌషధం" లంఘనము ఉత్తమ యౌషధమని చెప్పబడియున్నది. సామాన్యముగా నజీర్ణాదులకు లంఘనము కంటె శ్రేష్ఠమైన చికిత్స వేరొండులేదని గ్రహింపవలయును. మనపూర్వులు వ్రతోపవాసములు బెట్టినది శరీరారోగ్యము కొరకేగాని వేరొండుగాదు. మాసమున కొకపర్యాయమైన నిరాహారులుగా ఉపవసించుటచే కోశములు పరిశుభ్రమగును. అన్నమునుమాని దానికిబ్బడిగా పిండి పాలు మొదలగునవి గ్రోలుటకాదు. ఏకాదశీ ఉపవాసమువలన నిర్మలమైన జఠరాగ్ని గలుగుటయు భగవస్మరణ చేకూరుటయు కలదు. జ్వరాజీర్ణాదు లందు పసికూనలకు గూడా జీర్ణశక్తిని దెలిసికొని పాలుదాగ్రి గించవలయును. విరేచనము తెల్లగా నగుచున్న నజీర్ణమని గ్రహించవలయును.

కషాయాదుల వివరము.

౧ స్వరసము—అనగా వస్తువులయొక్క నిజరసమును గైకొనుట.

౨ కల్కము—యోషధులను చక్కగా నూరి నీటి యందు గలుపుట.

3 శృతము—కషాయము- క్వాథము- ద్రవ్యముల నుదకములో వైచి ఎనిమిదవ భాగము మిగులునటుల గాచునది.

౪ శీతము—ద్రవ్యముల నలియగొట్టి రాత్రిపూట నీటి లో వైచి నానబెట్టి ఉదయమున తేటనీరు వంచికొనుట.

౫ ఫాంటము—నీటిని బాగుగాగాచి ఓషధులచూర్ణ మును వైచి బాగుగా బిసికి అపుడే వడియగట్టి యుపయోగిం చుట.

## అజీర్ణము.

వ్యాధులు జనించుటకు అజీర్ణము ముఖ్యకారణము భుజించిన యన్నము జీర్ణముకాని యెడల పుల్లత్రేనుపులు, తలనొప్పి, ఆవలింతలు, కడుపుబ్బరము, ఒకొకప్పుడు విరేచనము, కడుపులో నొప్పి కలుగుచుండును. విషూచి, (కలరా) బుట్టు టకుకూడా అజీర్ణమే ప్రాధాన్యము. విషూచి తీవ్రముగానుండు దినములలో అజీర్ణకర పదార్థముల భుజించకూడదనియు, అన్న ములో తప్పక ఉప్పు జేర్చి వండుట మిగుల మంచిదనియు వైద్యు లభిప్రాయ మిచ్చియున్నారు.

౧ అన్నము అరగకున్న యెడల ఒకమట్టి పాత్రలో ఆవాలు బాగుగా వేయించి కొంచమునీరుబోసిదించి వంచుకొని త్రావిన అజీర్ణము హరించును.

౨ మంచియింగువ నిప్పుమీద పొంగించి పొడుముజేసి పేరిన నేతితో బుచ్చుకున్న అన్నము జీర్ణమై అజీర్ణమువలన గలిగిన కడుపునొప్పి హరించును.

3 పరిశుభ్రమయిన అల్లము ముక్కలుజేసి గాజుపాత్రలోవైచి నిమ్మపులుసుబోసి కొద్దిగా సైంధలవణముపొడి జేర్చి ఊరబెట్టి నిత్యము భక్షించిన అజీర్ణములు హరించును.

౪ శొంఠిని పైపొట్టుదీసి శుభ్రమొనర్చి మట్టిపాత్రయందుజేర్చి సైంధలవణమును మెత్తగానూరివైచి నిమ్మపులుసు శొంఠికొమ్ములు మునుగునట్లుపూరించి సెగపయి పులుసు యిగురువరకుగాచి కొమ్ములు బాగుగా పొట్టలు బగులునట్లు వేయించి దింపుకొని నిత్యము పావుతులముకొమ్ము భోజనమునకు ముందు భక్షించు చుండిన అజీర్ణములు హరించును.

౫ శొంఠిని పైపొట్టుగీచి కుమ్ములో (కాలుచున్న బూడిదలో) బెట్టి తీసికొని సైంధలవణముచేర్చి నూరి పొడిజేసి ఆపొడి మూడువ్రేళ్ళకు వచ్చినంత అన్నములో ప్రథమ కబళముతో భక్షించిన అజీర్ణములు హరించును.

౬. కరకచక్కలు, వేయించిన పిప్పళ్ళు, సౌవర్చలవణము ఇవినూరి వేడినీళ్ళతో పానముజేసిన సర్వాజీర్ణములు తొలంగును.

౭ బడబానలచూర్ణము—సైంధలవణము ౧ మోడి ౨ పిప్పళ్ళు 3, చెవ్యము ౪, చిత్రమూలము ౫, శొంఠి ౬, కరక

పిండెలు ౭, ఇవి చూర్ణమొనరించి సేవించిన అగ్నిదీపనము కలుగును.

౮ అమృతవటి—నాభి ౨, గవ్వభస్మము ౫, మిరియాలు ౯, యివిఅల్లపురసముతో మర్దించి పెసలంతటి మాత్రలొనరించి సేవించిన అగ్నిమాంద్యము దొలగును.

౯ చిత్రకాదిచూర్ణము--చిత్రమూలము, శొంఠి, వేయించిన యింగువ, వేయించిన పిప్పళ్లు, మోడి, చవ్యము, అజామోదము, మిరియాలు, ఇవిఒక్కొక్క కర్షము, సద్యక్షారము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, కాచలవణము, యివి ఒక్కొక్క కోలకము, ఇవి చూర్ణమొనరించి మాదీఫలరసముతోనైన దానిమ్మఫలరసముతోనైన తడిపి యెండించి పుచ్చుకొనిన గ్రహణి గుల్మ ఆమవాతములు హరించును. అగ్నిదీపనము కలుగును.

అజీర్ణములకు నిరాహారము (లంఘనము) పరమౌషధము ఘృతా (నెయ్యి) జీర్ణమునకు ఉష్ణోదకము, తైలాజీర్ణమునకు పుల్లనీళ్లు, గోధుమాజీర్ణమునకు దోసకాయ, అరటిపండు మామిడిపండు వీనియజీర్ణములకు ఘృతపానము హితకరములు.

## శైత్యాభారము (పడిసెము లేక జలుబు).

త్రాగునట్టి పానీయముయొక్క మార్పువలనను, దేశము మార్పువలనను, శీతలవస్తు భక్షణమువలనను, ఋతుసంధుల

యందును తరుచుగా శైత్యభారము జేయుచుండును. మిక్కిలి తుమ్ములు, ముక్కుల వెంబడి నీరుగారుట, తలనొప్పి, ఏమియు తోచకుండుట, ఒడలునొప్పి, కొద్దిజ్వరము, షడిసెను కొంచము వెనుకాడగనె దగ్గు యివి గలుగుచుండును.

కషాయము—సున్నముతో రుద్దిన మిరియాలు, కొంచము శొంఠి, కందులు జేర్చి నీరుబోసి కషాయముగాచి దింపుకొను సమయమున తాటిబెల్లముగాని తాటికలకండగాని వేసి దింపుకొని పానముజేసిన శైత్యభారము, ఒడలు నొప్పి, ఉష్ణము మొదలగునవి హరించును. మూడుదినములు రేపు మాపు పుచ్చుకొనవలయును. రాత్రియందు పజ్జెగ మానుకొని చారుగాని పాలుగాని త్రాగుట మంచిది. ఈకషాయముతో కస్తూరిమాత్రల సేవించవచ్చును.

ఆవిరిచికిత్స—నీరు బాగుగాగాచి అందు పసుపుజేర్చి ఆవిరిబట్టవలయును. లేక పాలు గాచి వానియావిరిబట్టవలయును. ఈఆవిరులుబట్టుట కూడ నిషిధానముగాదు. పూర్వమునుండి ఆచారములో నుండియున్నది.

తలనొప్పికి—శొంఠి, కుప్పికొమ్ము, కచ్చూరాగములు, కొంచము సాంబ్రాణి యివి వాయింటాకు పసరులోగాని నీటితోగాని గంధముదీసి కణతలకు, ముఖమునకు లేపనముజేసి అగ్నిపై సాంబ్రాణివైచి ధూపము బట్టవలయును.

తలదిమ్మెకు మెడనొప్పులకు—ఉమక (వేడి) అన్నమును వస్త్రమున మూటగట్టి కాచవలయును. ఇదియు ఆవిరి చికిత్సలో చేరినదే. చాలామంచి ప్రక్రియ.

శైత్యభారము మరీ వేగముగా నున్నయెడ చనుబాలతో మంచి యింగువగాని గోరోచనముగాని సాది ముక్కుమీద పట్టువేయవలయును.

శిరోభారమునకు—వెనుక చెప్పియున్న రాజభూతాంజన కలికమును నీటితో సాది కనులలో బెట్టవలయును.

౧ నల్లజీలకర్రను గుడ్డలో మూటగట్టి నలచి వాసన జూచుచుండవలయును.

౨ చుట్ట అభ్యాసమున్నవారలు—చుట్టలో వాము జేర్చి చుట్టత్రాగవలయును.

3 మంచిగంధము, ఆవాలపొడి కలిపి నుదుటను, కణతలకు పట్టువేసిన శిరోభారము హరించును.

౪ దూసరతిగె వేరుతో ఆవాలను అరుగదీసి యాగంధమును కణతలకు, మాడుకు పట్టువేయవలయును.

౫ మిరియాలు గరిటలో వైచి నెయ్యిబోసి పెళపెళ వేయించి నేతితోసహా మిరియాలు అన్నములో వడ్డించుకొని భక్షించవలయును. గొంతు బొంగుబోయిన హరించును.

౬ మిరియాలు తమలపాకులోజుట్టి ఆముదము దీపపు కొడిన లోపలిగింజలు చిటచిట యనుదాకగాచి యాపొట్లము

నమిలి మ్రింగవలయును. సారముగానుండిన తమలపాకుల చెమ్మ
బెల్లము బుగ్గను బెట్టుకొనవలయును.

౭ మిరియపుగింజ సూదికిగుచ్చి దీపపు సెగనుగాచి
ఆపొగ కపాలమున కంటునట్లు బీల్చిన కనులవెంట నీరుగారి
శిరోభారము నెమ్మదించును.

౮ కొందరు సల్లమందు మాత్రిలవైచికొనుటకలదు.

పడిసెము దగ్గుకు

౧ కరక్కాయచెక్క బుగ్గనుబెట్టిపంచుకొనవలయును.

౨ తాటికలకండ బుగ్గను బెట్టి పంచుకొనవలయును.

3 దాచిన అరఖు తమలపాకునకు బూసి భక్షింప
వలయును.

౪ వేయించిన మిరియపుచూర్ణమును చక్కికేళి అరటి
కాయలో కూరి భక్షింపవలయును.

గొంతునొప్పికి—శొంఠి, మిరియాలు ఇవి నీరుసున్నము
తోనూరి గరిటెలోవైచి పాలుబోసి ఉడికించి గొంతుకకు పట్టు
వేయవలయును.

దగ్గుకు—లవంగములు కాచి పొంగించి బుగ్గనుబెట్టి
పరుండవలయును. పడిసెము ముదిరి ముక్కులవెంట నెత్తురు
బడిన నీరుల్లిపాయనలచి వాసనజూడవలయును.

ముక్కులో దుర్వాసనబుట్టినను క్రిములుబడినను శొంఠి

పొడి పీల్చవలయును. పడిసెము నూరురోగముల పెట్టని పెద్దలు జెప్పుచుందురు. ప్రాణమోసము లేదుగాన నిర్భయము.

ముక్కులు బిగవేసిన శొంఠిపొడుముగాని సాంబ్రాణి రఖు (పువ్వు) గాని పీల్చవలయును.

దగ్గుకు—లవంగములు, మడ్డివెలిగారము గరిటలో పొంగించి పొడిచేసి ఆపొడిని తేనెతో భక్షించవలయును.

గ్రహణి (బంకవిరేచనములు)

ఇవి సాధారణముగా వర్షఋతువు ప్రారంభమున గలుగుచుండును. అన్నకోశములో మడ్డి కారణాంతరముచే బాహ్యగత మగుటయని వైద్యశాస్త్రాభిప్రాయము. ఇందు వాతాది భేదములు గలవు. నాటినాటికి మలముబాధతో వెడలుట, అన్నము జీర్ణముగాకుండుట, ఆకలి జచ్చుట మొదలగు గుణములు కలుగును. గ్రహణియందు తొలుత చికిత్సనూడను.

౧ గసగసాలు, దాచినిచెక్క యివిపొడిజేసి అన్నములో భక్షించిన గట్టును.

౨ గవ్వపలుకు సాంబ్రాణి, ఆరతికర్పూరము శుద్ధిచేసిన యింగిలీకము యివి నూరిన మైనమువలె నగును. కందిగింజంత మాత్ర యామమునకొకటి భక్షించవలయును.

3 మంచి అల్లపుముక్కలు జెజ్జములువేసి అందు నల్లమందుమాత్రల నిడి పైన తడిగుడ్డజుట్టి పేడబూసి నాలుగైదు పిడకలతో పుటమువేసి పైకొని చల్లార్చి నూరి మాత్రలగట్టి

రక్షామునొకటిభక్షించిన గ్రహణులు హరించును. పైత్యగ్రహ ణులాను మిగుల బసి యొనరించును.

౪ చిల్లగింజలు (ఇండుపువిత్తులు), చింతవిత్తులు గంధ ముతీసి దానిలో తంగేడువేరు పట్టజేర్చి మర్దించి మాత్రలుగట్టి పంచదారలో పొలిపి భక్షించిన ఉష్ణగ్రహణులు గట్టును.

౫ నీరుల్లిపాయకు రంధ్రముచేసి దానిలో నల్లమందు బెట్టి పైన తడిగుడ్డజుట్టి పేడబూసి అగ్నిలో నుడికించి యాపా యను భక్షించిన ఉష్ణగ్రహణులు హరించును.

౬ వెల్లుల్లిపాయలలో నొకరెబ్బది గైకొని దానిలో నల్ల మందుకూరి పైన తడిగుడ్డజుట్టి పెండబొదివి యుడికించి సేవించి న వాత గ్రహణులు గట్టును.

౭ త్రిమూర్తిగ్రహణి—ఇంగిలీకము, రససింధూరము, రసకర్పూరము ఇవి శొంఠిరసములో నూరి పెసలంత మాత్ర లగట్టి సేవించిన వాతగ్రహణులు హరించును. ఇంగిలీకము చనుబాలలోనూరి శుద్ధి జేయవలయును లేనియెడ వేపచెక్క రసములో నూరిన శుద్ధియగును.

౮ ఖర్జూరగ్రహణి—గసగసాలు, దాచినిచెక్క, కోడి శపాల, నల్లమందు, యింగిలీకము, అతివస, యివినూరి ఖర్జూర ఫలములలో గుక్కి పైన తడిగుడ్డజుట్టి పేడబొదిగి నాలుగై దుపిడకలతో పుటముబెట్టి తీసి మర్దించి మాత్రలుగట్టి రక్షాము కొకటి భక్షించిన సమస్త గ్రహణులు గట్టును.

౼ దానిమ్మగ్రిహణి-గసగసాలు, కోడిశపాల, అతివస, యింగిలీకము, రసకర్పూరము, రససింధూరము, దాచినిచక్క యివి నూరి దానిమ్మకాయలోని విత్తులదీసి యీపొడిని నూరి నల్లమందుమాత్రి పొడిమధ్య నిడి పైన తడిగుడ్డజుట్టి పేడగొదివి పుటము పెట్టి తీసి నూరి మాత్రిలగట్టి యొసంగిన సమస్త గ్రిహణులు హరించును. దానిమ్మచక్కలు ఉప్పునూరి మాత్రి లుగట్టి పెరుగుతో భక్షించవలయును.

దానిమ్మయిగురు పెరుగుతో భక్షించిన గ్రిహణులు గట్టును.

మెంతులు పెళపెళ వేయించి పెరుగుతో భక్షించిన గ్రిహణులు గట్టును.

కరివేపాకు, మిరియాలు కొంచము ఉప్పుజేర్చి నూరి పెరుగుతో భక్షించిన గ్రిహణులు హరించును.

ఇంగువ పొంగించి పేనసేతితో భక్షించిన వాతగ్రిహణులు గట్టును.

ఓమను వేయించి నూరి మరల వేయించి నూరి యిట్టు లేడుసారు లొనరించిన మైనపక్వమునకు వచ్చును. దానిని మాత్రిలు గట్టి సేవించిన గ్రిహణులు గట్టును.

శొంఠి నీటితో మెత్తగానూరి గరిటెలో కొంచము నేయివైచి యుడికించి దింపుకొనునపుడు కొంచము పటికిబెల్లము పొడివైచి కలపి మాత్రిలు గొనిన గ్రిహణులు హరించును. దీనినే శొంఠి ఉక్కెర యనియెదరు.

బెల్లము పాకుబట్టి దానిలో ఓమనుగలపి దింపి ముద్ద లుజేసి భక్షించిన గ్రహణులు గట్టును. దీనినే వాముయుక్కెర యనియెదరు.

జాజికాయగ్రహణి—జాజికాయకు రంధ్రమువైచి నల్ల మందుమాత్ర బెట్టి తడిగుడ్డజుట్టి పేడబూదిపి రెండు మూడు పిడకలతో బుటము బెట్టి తీసి కుంకుమపువ్వు ౨ చిన్నములు చేర్చి తమలపాకు రసముతోనూరి మాత్రలుగట్టి పుచ్చుకొనిన జ్వరములు గట్టును.

"గ్రహణ్యామతిసారే చాహ్యఫేనం మాతృవత్పుపేత్" గ్రహణ్యాతిసార రోగులను నల్లమందు తల్లివలె బోషింపుచుం డు గావున నల్లమందు జేరిన సూషధముల వల్లనే గ్రహణ్యా తీసారముల హరింపజేయవలయును. బసవరాజీయం. పు 333.

ఆమకుఠారము—జాజికాయ, త్రికటకములు, పేల్చిన వెలిగారము, శుద్ధిజేసిన రసము, శుద్ధిజేసిన గంధకము, నల్లమందు, శుద్ధిజేసిన నాభి, తుంగముస్థలు, కొడిశపాల, చిత్రమూలము, త్రిఫలములు, అతివస, బూరుగుబంక, యవక్షారము, నేతితో పొంగించిన యింగువ, ఇవి సమములు కల్వములో జేర్చి గంజాయి యాకు రసముతో మూడుదినములు మర్దించి మాత్రలొనరించి శొంఠి కషాయముతో బుచ్చుకొనిన గ్రహణ్యాతిసారములు హరించును.

అతిసారములకు పాఠాదిచూర్ణము—చిరుబొద్ది (అగరు శొంఠి), బూరుగుబంక, తుంగగడ్డలు, ఆరెచక్క, మారేడుగుజ్జు, శొంఠి వీటిని సమభాగములు గ్రహించి చూర్ణమొనరించి మజ్జిగలో కలిపి కొంచెము బెల్లముచేర్చి పానము జేయించిన దారుణములైన అతిసారములు గట్టును.

కొడిశపిత్తులు, యింగువ, అతివస, వస, సౌవర్చలవణము, వట్టివేరు, యివి చూర్ణమొనరించి వేడినీటితో పానముజేసిన వాంతి, రొమ్మునొప్పి, శూల యివి కలిగిన గ్రహణికట్టును. కరక్కాయ చక్కలు, సౌవర్చలవణము, జీలకర్ర, యివిసమ చూర్ణమొనరించి యివి ఉష్ణోదకములో గలపి, కొంచము మిరియపు చూర్ణము గలపి పానము జేయించిన కడుపునొప్పి, వాంతులు గట్టును.

ఉమ్మెత్తవేళ్ళకల్కమునకు సమము మిరియపు చూర్ణము చేర్చి మర్దించి రెండు గురివింద గింజలయెత్తు మాత్రలసేవించిన శ్రీరాముడు వారధిగట్టిన భంగి గ్రహణ్యాతిసారముల బంధించును

పథ్యములు—పొట్లకాయ, కొడిశకాయ, జాజికాయ, పులిచింత, అరటిపండు, మారేడుగుజ్జు. చక్రవర్తికూర, నిద్ర వెలగపండు, అరటిపువ్వు, కందికట్టు, మజ్జిగ యివి పథ్యములు.

## జ్వరచికిత్సలు.

వృద్ధకుదాద్రి కషాయం—వాకుడువేరు, నేలవేము, పొట్ల, చందనము, తుంగగడ్డలు, చేతిపొట్ల, తిప్పతీగె, పద్మకము, అడ్డసరము, వేసనము, పుష్కరమూలము, జటా మాంసి, వేపచెక్క, గంటుభారంగి, వేగిసచెక్క, చంగల్వకోష్టు దురదగొండివేళ్ళు, వీనికషాయము గాచి యొసంగిన సమస్త జ్వరములు హరించును. జ్వరము లన్నిటికి ఆనందభైరవి వాడ వచ్చును.

వాతకఫజ్వరములకు కషాయం—తుంగగడ్డలు, తిప్ప తీగె, శొంఠి, అడ్డసరము, వట్టివేరు, పర్పాటకం, కరకచెక్కలు వాకుడువేరు, దురదగొండివేరు, యివికషాయముపెట్టి త్రాగిం చిన వాత కఫ జ్వరములు హరించును.

పైత్యజ్వరమునకు కషాయం—౧ తిప్పతీగె, నేలవేము, ధనియాలు, పద్మకం, రక్తచందనము, వీటిని కషాయముపెట్టి ఆనందభైరవిని సాది యొసంగవలయును.

౨ వెలగాకు జీలకర్ర నీటియావిరి మీద యుడికించి రసము పిండుకొని కొంచము తేనె జేర్చి పానము జేయించిన వమనములు, ఛర్ది, పైత్యము యివిహరించును.

వాతపైత్యజ్వరమునకు కషాయం—తిప్పతీగె, పర్పాట కము, తుంగగడ్డలు, నేలవేము, శొంఠి, వీనికషాయ మొసంగవ లయును.

౧ శొంఠి, తిప్పతీగె, తుంగగడ్డలు, దురదగొండి వేళ్ళు

౨ నేలవేము, కటుకరోహిణి, తుంగముస్తలు, పర్పాటకము దురదగొండి.

3 శొంఠి, అడ్డసరము, తుంగగడ్డలు, దురదగొండి వేళ్ళు ఈమూడు ప్రకరణాలలో దేనినైనా కషాయము గాచిమొసంగిన వాతపైత్యములు హరించును.

వాతజ్వరమునకు కషాయము-తిప్పతీగె, శొంఠి, మోడి వీనికషాయము గ్రోలిన వాతజ్వరములు హరించును. వాతజ్వరములందు కస్తూరిమాత్రల వాడవచ్చును.

పైత్యశ్లేష్మములకు కషాయము—రక్తచందనము, పద్మకాష్ఠము, ధనియాలు, తిప్పతీగె, వేపబెరడిమలు, వీని కషాయమొసంగిన పైత్యకఫములు హరించును.

జ్వరములకు సాధారణ కషాయము—గంటుభారంగి, తిప్పతీగె, తుంగగడ్డలు, దేవదారు, పెద్దములక, శొంఠి, పిప్పళ్లు, పుష్కరమూలము, వీనికషాయ మొసంగవలయును. లఘుజ్వరహరమాత్రలు వాడవచ్చును.

జ్వరము పక్వమగుటకు కషాయం—దేవదారు, ధనియాలు, శొంఠి, పెద్దములక, చిన్నములక, వీనికషాయమొసంగిన జ్వరము పక్వమగును.

శ్వాసకాస జ్వరమునకు కషాయము—కరకపువ్వు, పిప్పళ్ళు, గుమ్ముడు, ఉలవ, పుష్కరమూలము, వీనికషాయము

చల్లారినమీద తేనె జేర్చి త్రాగిన రొప్పు దగ్గు కట్టును.

సన్నిపాతములను పంచకోల కషాయము—చిత్రమూలము, పిప్పళ్ళు, చెవ్యము, శొంఠి, మోడి, వీనిని కషాయము పెట్టి యొసంగిన అసాధ్య సన్నిపాతములు దొలంగును.

ఆర్కాది కషాయము. ధన్వంతరీవైద్య లహరి—

సీ॥ దారు తక్కలి జిల్లేడు వేరుపట్ట
నేలవేమును వస పంచ కోలములను
గుంటగల్గరయు దురద గొండి మునగ
చెక్క రాస్నము వావిలి జేర్చినీట
గాచి యొసగ ధనుర్వాత కాసచయము
సన్నిపాతాది సూతికల్ సమయుటరుద॥

దారు=దేవదారు; రాస్నము=సంపరాస్నము; తక్కలి సుగమము.

—♦ఆహ్నికజ్వర కషాయము♦—

గీ॥ ధాన్య జలధర రక్తచందనమువట్టి
వేళ్ళు నాగరమును వీనివేగగాచి
తేనె శర్కరలనుజేర్చి పానమునకు
నొసగ త్ర్యాహిక జ్వరములు భసితమగును॥

ధాన్య=ధనియాలు; జలధర=తుంగగడ్డలు; నాగర=శొంఠి.

చలిజ్వరములకు (శీతజ్వరము)—తిప్పతీగె, వేపచక్క,

ఉసిరిక వరుగు వీనికషాయములో శీతాంశు రసము సాదికలిపి యొసగిన శీతజ్వరములు హరించును.

విషమజ్వరములకు—తులసియాకు రసములోగాని తుమ్మిపూల రసములోగాని వేయించిన మిరియాల చూర్ణమును గలపి పానముజేయించిన విషమజ్వరములు హరించును.

సర్వజ్వరములకు కషాయం—

సీ. నేలముల్క సుగంధి ♦ పాలపిప్పలి నేల
యుసిరిక విషబొద్ది ♦ యుసిరకలును
కటుకరోహిణి దార్వి ♦ కౌటజంబులు రక్త
చందన తుంగము ♦ స్థలును వట్టి
వేరులు యతివస ♦ మారేడుపిందెలు
వస వీని సమములు ♦ వెస కషాయ
మునుగాచి యొసగుచు ♦ తనువునకుబూసిన
విషమజ్వరంబులు ♦ విడుచు టరుదె

గీ. తీయలు తలపోట్లు వాంతిశో ♦ షలు హరించు
పార్శ్వశూలలు యరుచులు ♦ భసితమగును
సంధిగతవాయువలుద్రొల్లి ♦ సమయునున్న
వాయువ్రలు శక్తియుతభావ ♦ వామదేవ.

ధన్వంతరివైద్యలహరి.

కౌటజములు=కోడిశవిత్తులు, విషబొద్ది=అగరుశొంఠి.

## దగ్గులకు.

౧ వాకుడుకాయలలో లవంగములుగుచ్చి పైన తడిగుడ్డలు జుట్టి పేడబొడివి నాలుగైదు పిడకలలో పుటముబెట్టి ఉడికినకాయలను గైకొని బాగుగామర్దించి మాత్రలుగట్టి వాడిన కాసలు హరించును.

౨ వాకుడుచెట్టు సమూలము నెండబెట్టి పొడుముజేసి యుంచుకొని వేడినీళ్ళలో పొడుముపైచి వడియబోసి త్రావిన దగ్గులు హరించును.

౩ మిరియాలు వేయించి పొడుముజేసి చక్రకేళి అరటి ఫలముతో భక్షించిన దగ్గులు మానును.

౪ దాచినఅరఖు తమలపాకుకు నలది భక్షించిన కాస హరించును.

౫ పగడభస్మము పేరిన నేతితోదినిన దగ్గు గట్టును.

౬ తెల్లజిల్లేడు వేరుపట్ట కొంచము తమలపాకుతో భక్షించిన దగ్గు హరించును.

౭ బలురక్కసియాకు కొద్దిగా తమలపాకుతో దినిన శ్లేష్మము తెగి పడును.

౮ కరకపువ్వుచూర్ణము తేనెతోగొనిన కాస నెమ్మదించును.

౯ కల్లుతోదింపిన సారాయము నీటితోకలపి పుచ్చుకొనిన దగ్గు నివారణమగును.

## నారికురుపు (నాడీవ్రణము)

౧ నెమలియీకె మధ్యనుండు కన్నుదీసికొని కాల్చి మసి జేసి వెన్నలోఁగలపి భక్షించిన నారికురుపులు నయమగును. ఇది పరమ హంసక్రియ.

౨ దివిసెనపాకు ఆముదములోఁజేర్చి పిసికి కట్టుగట్టినను యెర్రిమండిగపు ఆకులునూరి యుడికించి గట్టినను నారికురుపులు హరించును.

3 బీంవేళ్ళ రసముతీసి యవక్షారము కలపి పూటకు తులమువంతున ఐదుపూటలిచ్చిన నారీవ్రణములు హరించును.

చేతులగజ్జికి—మంచినీరు సున్నము ఆముదము మెత్తగా నూరి లేపన మొనరించిన బాగుగా మానును. చాలామంచి ప్రక్రియ.

తీటగజ్జి జిలలకు—మిరియాలు, కస్తూరి, పసపు, మణిశిల, గంధకము, పసపు, జీలకర్ర, నల్లజీలకర్ర, పాదరసము, గంగసింధూరము, హరిదళము, తగరపువిత్తులు, తంగేడు విత్తులు, భావంచివిత్తులు, యివి మెత్తగా పొడుమొనర్చి వెన్నను జేర్చి యినుముతోఁనూరి బూసిన సమస్త తీటలు మానును.

గుంటగల్గర పసరుదీసి శరీరమునకు లేపన మొనర్చిన తీటలు హరించును.

తంగేడుయిగురు పెరుగుతో నూరిబూసిన ఉష్ణమువలన కలిగిన తీట నిస్సంశయముగా నివారించును.

రొండిగజ్జికి (పామా)—పాదరసము గంధకము యివి ఉమ్మెత్తాకు రసముతో నూరి నూనెలో గలపిబూసిన రొండు గజ్జిమానును.

జిల్లేడుబాలు బూసిన రొండుగజ్జి నిస్సంశయముగా నివారణమగును. మరలెన్నిటికిని రానేరదు. మంటకు సహించవలెను.

## కురుపులు తేలుటకు కట్లు.

౧ గోధుమపిండిగాని బియ్యపుపిండిగాని నీటితో యుడికించి కొంచము ఆముదముకలపి దినమునకు నాలుగుకట్లు విడువక గట్టుచుండిన కురుపులు తేలి పగులును. పిండికట్లు చాలామంచిది. మంటలున్నయెడ అవిశపిండి నీటిలో గలపి గుడ్డకుపట్టించి పట్టి వేయవలయును. గడ్డగట్టినయెడ రణపాలాకులకు ఆముదము బూసి నిప్పులపై గాచి కట్టుచుండ వలయును. బాలింతబోలు, బియ్యము, యివి నీటితో మైనపాకముగా నూరి పట్టివేసిన గడ్డలు కరుగును.

౨ మఱ్ఱిపాలుగాని, జిల్లేపాలుగాని, గుడ్డకు పట్టించి పట్టి వేసిన తేలి పగులును. లేదా అణగిపోవును.

3 ఇంగిలీకము, హారతికర్పూరము గవ్వపలుకు సాంబ్రాణి యివి సమములు నూరిన మైనముగా దిగును. అది గుడ్డకు

పట్టించి పట్టివేసిన కురుపులు తేలి పగిలి హాయినిచ్చును.

౪ ఆవు వెన్న గోడకుగొట్టి నీరుపోయినపిమ్మట దూదికిబూసి వేసిన మంటలణగి, రసికను వెలిబుచ్చును.

౫ పిచ్చి కుసుమను సమూలము నూరి బిళ్లగట్టిన చీము బాగుగా గారి కురుపులు మానును.

వడిసెగడ్డ—మంచినీరు సున్నము కోడిగుడ్డులోని తెల్లసొన యింగువ యివి నూరి పట్టివేసిన సమసిపోవును. మొటమరించిన వెంటనే యీ పట్టీలు రెండుమూడు వేయవలయును.

## కొరుకు పుండ్లకు.

౧ రసకర్పూరము ఉమ్మి (ష్ఠీవనము) తో సాది రెండు మూడు దినములు పులిమిన మానును.

౨ నీలిమందు రసకర్పూరం యివి నీళ్ళతో సాది లేపన మొనర్చిన కొరకు హరించును.

కాలిన పుండ్లకు—సున్నపు తేటనీరుతో కొబ్బరినూనె గాని, మంచినూనెగాని, జేర్చి గిలకొట్టిన తెల్లగా వెన్నవలె నవనీతమగును. ఇది పూయవలయును.

కాళ్ళుచేతులు పగిలినందుకు—మైనము గుగ్గిలము బెల్లము తేనె నెయ్యి యివి కరగించి అందు సైంధలవణము కావిరాయి వీనిపొడుము గలపి బూసిన నయమగును.

కరపాదములు పాసి కొరకు గల్గినందుకు (అలసక)—
తడినేలను బురదలో తిరుగుటచే వ్రేళ్లసందున మాంసము కుళ్ళి నీరుగారుచు దురద మంట పోట్లుగలుగును. ఇదియే అలసకము.

౧ పసుపు, కానుగువిత్తులు హరిదళము పద్మ కాష్ఠము అన్న భేది గోరోజనము యివి తేనెలో మర్దన జేసి పూసినమానును.

౨ మూత్రము బోసికడగిన నివారణయగును. నిస్సందేహము.

సెగరోగములు (గనేరియా) పచ్చశెగకు.

౧ నల్లజీలకర్ర తు ౪ తెల్లజీలకర్ర తు ౪ వంగభస్మము తు ౪ లవంగములు తుం ౧ తబాషీరు తు ౪ ఏలకులు తు ౦ యివి చూర్ణమొనరించి పూటకు తు ౦ ౪ చొదినీ అత్తరుతో గాని,శర్కరతోగాని పుచ్చుకొన్న పచ్చసెగ నివారణయగును.

౨ పచ్చకర్పూరము తు ౧ కుంకుమపువ్వు తు ౧ ఏలకులు తు ౧ దాల్చినపట్ట తు ౧ చలువమిరియాలు తు ౧ ఇవి చూర్ణమొనరించి చెందినీ అత్తరుతో మర్దించి గురిగింజ ప్రమాణము వటకములు చేసి ఎప్పుడు [illegible] పుచ్చుకొనిన చిరకాలము నాటి పచ్చసెగలు [illegible].

3 సాలామిస్రీ తుం౧ చలువమిరియములు తు౧ తెల్లజీలకర్ర తు ౦ ౻ రేవలచిన్ని తు 3 వీని చూర్ణము పూటకు తుం ౪ వంతున తెల్లచక్కెరతో బుచ్చుకొనిన పచ్చసెగ హరించును.

తెల్లసెగకు—లవంగములు ఏలకులు రేవలచిన్ని

వాయువిడంగములు మిరియాలు దాల్చినపట్ట యివి సమములు చూర్ణమొనరించి శర్కరజేర్చి చెందిని అత్తిగులో మర్దించి చిల్లవిత్తంత మాత్రల పుచ్చుకొనిన తెల్లసెగ తప్పక నివారణ యగును.

పరమహంస క్రియలు—మునగపువ్వు తు ౧ సెనగ పప్పుతో ఉదయకాలమందు భక్షించిన తెల్లసెగ తప్పక నివారణయగును. పథ్యము బాగుగా చేయవలయును. పులుసు కారము నేయి తగ్గించవలయును.

చిల్లవిత్తులు (యీదుపగింజలు) ఇవి కొంచము నలియ గొట్టి రాత్రిపూట మజ్జిగ (తక్రము) లో నాననైచి ఉదయం బాగుగనూరి మాత్రబుచ్చుకొని యా చల్లనుత్రాగ వలయును. తెల్లసెగ తప్పక నివారణయగును.

ఎఱ్ఱసెగకు—కర్పూరశిలాజితు తు ౧, పాతబెల్లము తు ౧౪, శొంఠి, తు ౦౪, పిప్పళ్ళు తు ౦౪, మిరియాలు తు౦౪, యివి మురుపిండాకు (కుప్పింటాకు) రసముతో నూరి గచ్చకాయంత మాత్ర బుచ్చుకొనిన ఎఱ్ఱసెగ నివర్తించును.

పచ్చకర్పూరము తు ౦౧, నల్లజీడిగింజలు తు ౦౧, కర్పూరశిలాజితు తు ౦౧, శంఖభస్మము తు ౧, ఏలకులు తు ౦౧, దాల్చినిపట్ట తు ౦౧ యివి చూర్ణమొనరించి పూటకు పావు తులము వంతున యిరువది దినములు సేవించవలయును.

సర్వవిధములగు సెగలకు—ఏలకులు తు ౦౪, చలవ మిరియాలు తు ౧ పొంగించిన పటికి తు ౨౪, పొంగించిన వెలిగారము తు ౪ కర్పూరశిలాజితు తు ౧౪, సురాకారము తు ౦౹, దాల్చినిపట్ట తు ౦౪, పచ్చకర్పూరము తు ౦౪, కుంకుమపువ్వు తు ౦౹, గసగసాలు తు ౦౹ వీని చూర్ణము పూటకు పావుతులము చొప్పున చెందినీ అత్తరుతో బుచ్చుకొనిన చిరకాలము నాటి సర్వసెగలు నివారణమగును.

సర్వవిధములగు సవాయిలకు.

౧ నేలతాడిగడ్డలు తు ౧, కురాసానివాము తు ౧, లవంగాలు తు ౧, జాపత్రి తు ౧, శిలాజితు తు ౧, వాము తు ౧, కన్నెకోములి తు ౧, కురంజివాము తు ౧, తెల్లజిల్లేడువేరు తు ౧ యివి చూర్ణముజేసి అంత నువ్వులు పాతబెల్లము నల్లజీడిగింజలు యివి తులములు జేర్చి బాగుగా మర్దించి కుంకుడు విత్తంత మాత్రబుచ్చుకొనిన సర్వసవాయీలు హరియించును.

౨ జీడిగింజలు శే ౦౹, కొబ్బరి యేబులము (తు ౧౫ కావచ్చును) పాతబెల్లము యేబులము యివి బాగుగా దంచి ముద్ద జేయవలయును. పిమ్మట పిప్పళ్లు, మిరియాలు, పిప్పలికట్టె (మోడి) ఓమము, చిత్రమూలము, తెల్లజిల్లేడుపట్ట తులములు వీని చూర్ణమొనరించి తేనెపాకము బట్టి పైముద్దను చూర్ణమును జేర్చి లేహపక్వముగా దింపుకొనవలయును. పూటకు తు ౨౪ మొదలు తులమువరకు పుచ్చుకొనవచ్చును.

3 గులాబీమొగ్గలు, మసాంబరము, శొంఠి, సునాముఖి, కరక్కాయలు, ఉసిరికకాయలు, నల్లకరక్కాయలు, పచ్చిపసపు ఇవి సమములు కలబందగుజ్జులో నొక దినము మర్దించి కుంకుడువిత్తులంత మాత్రలు సేవించిన సర్వసవాయిలు హరించును.

## సవాయిపుండ్లకు పూత.

౧ హారతికర్పూరము, జంగాలిపచ్చ, యింగిలీకము, పాదరసము, తాళకము, రసకర్పూరము కాచు రససింధూరము యివి పొడుముజేసి ఆవువెన్నలో కంచుకంచముపై రాగిపాత్రతో నూరి పుండ్లకు పూయవలయును

౨ కాచు, యింగిలీకము, రసకర్పూరము కాల్చి పొంగించినమైలతుత్తము మృదారుచిన్ని యివి సమములు వెన్నతో మర్దించి సవాయిపుండ్లకు లేపన మొనర్చిన నయమగును.

నీరుచురుకు గన్నేరియాకు—పొంగించిన పటికి పొంగించిన మడ్డివెలిగారము, సు[illegible] ఇవి సమములు [illegible] పొడి యొనర్చి వెన్న[illegible]గా మాగి[illegible] భక్షించిన నీరుచురుకు సెగలు హరించును

కస్తూరిపసపు, ఉశిరికపప్పు ఇవి చూర్ణ మొనరించి వీటికి సమము చక్కెరగలపి పూటకు తులము వంతున పుచ్చుకొనిన తెలుపు, ఎరుపు, చురుకులు మానును.

విషూచి (కలరా) కి మంచి మాత్రలు—వాము తు౦4

మిరియాలు తు ౧, మిరపవిత్తులు తు ౧, పాలయింగువ తు ౧ హారితికర్పూరం తు౧, నల్లమందు జేడయెత్తు కస్తూరి చిన్నం ౧ యివి అల్లపురసం నల్లేరురసములతో మర్దించి కందిగింజలంత మాత్రిలు జేసి వాడవలయును. ఇవి అజీర్ణములకుకూడా పనికి వచ్చును.

చర్దికి (డోకు) మయూరభస్మము—వెలగాకు, మంచి పట్టుగుడ్డ, నెమలియీకె, నల్లజీలకర్ర, యాలక్కాయలు, లవంగాలు, శొంఠి, అక్కలకర్ర, పిప్పళ్ళు యివి పెంకులోజేర్చి మాడ్చి చూర్ణముజేసి సీసాలలో భద్రపరచుకొని కొంచము పొడి తేనెలో నాకించిన చర్దులుకట్టును.

వరిపేలముల జావలో శొంఠిపొడిని జేర్చి త్రాగించిన చర్దులు హరించును.

ఎండిన కొబ్బరి బొక్కలో నీరుదెచ్చి పానముజేయించిన చర్దులు ఎక్కిళ్ళు యివి హరించును.

ఆవాలు నీటిలో మెత్తగానూరి గుడ్డకు పట్టించి రొమ్ము యందు పట్టి వేయవలయును ఇది విశేషకాలము యుంచిన పొక్కు పుట్టును గాన మంట బుట్టినపుడనే పట్టు తీసివైచి తుడువవలయును.

ముఖమాగులకు—గేదెపాలను చిలికి వెన దీసి ముఖమునకు లేపన మొనరించిన మాగులుమాని కాంతిగలుగును.

పచ్చిపసుపు, మానిపసపు, మంజిష్టి, నెయ్యి, తెల్లా

వాలు, కావిరాయి వీనిని మేకపాలతో నూరి ముఖమునకు లేపనమొనర్చికొనిన బాలసూర్యుని వంటి కాంతి గలుగును.

మంజిష్టి లేక నేలతాడిగడ్డల గాని తేనెతో నూరి బూసిన మంగులు నల్లని పొడలు హరించును.

పచ్చిపసపు, రక్తచందనము యివి బఱ్ఱెపాలతో నూరి యలదిన నల్లని మండలములు నివారణయగును.

ఇంద్రలుప్తము (పేనుకొరకుట)—గుంటగలగరాకు రసములో తైలముగలపి చిక్కగాగాచి తల యంటుకొనిన వెంట్రుక లూడుట మానును.

కరక్కాయచెక్కలు తాడికాయ ఉసిరికవరుగు నల్ల కలువగడ్డలు యష్టిమధుకము వీని చూర్ణము గుంటగలగరాకు పసరుతో నూరి కల్కముజేసి గుంటగలగరాకు రసము బోసి దాని కర్ధము నువ్వులనూనె జేర్చి తైలపక్వముగా గాచి తల యంటుకొనిన కేశములు వృద్ధిజెందును.

దాసాని పువ్వులను కరియాపు పంచితముతో నూరి బూసిన పేనుకొరకుట మాని వెంట్రుకలు బెరుగును.

కుంకుమాదితైలము—కుంకుమపువ్వ చందనము లొద్దుగ పట్టి రసకర్పూరము రక్తచందనము మాన్నిపసపు మంజిష్టి వట్టివేళ్లు అతిమధురము లవంగపత్రి పద్మకాష్టము తామరగడ్డ చెంగల్వకోష్టు గోరోచనము పసపు లక్కమాన్నిపసపు కావి రాయి నాగకేసరములు మోదుగపువ్వ పేంకణము మజ్జి

చిగుళ్లు జాజిమైనము తెల్లావాలు తులసి వస యివి సమములు నూరి నాలుగింతలు పాలుబోసి కషాయముగాచి యందు రెండు ప్రస్థములు నూనె గలపి మందాగ్నిచే తైలపక్వ మొనర్చి దింపి ముఖమునకు లేపనమొనర్చికొనిన వ్యంగను సీలిక తిల కాలము మొటిమలు మొదలైనవి హరించి కాంతిగలుగును.

స్వరభంగమునకు (కంఠస్వరము లేకున్న)—అల్లము, గుంటగలగర, గోరింట, వస, మండూకబ్రాహ్మి భావంచివిత్తులు వీనిచూర్ణము ఉష్ణోదకముతో మాఘ బ ౧౨ లు మొదలు ౧౨ దినములు సేవించిన కోకిలస్వరము గలుగును. మం. నూక బ్రాహ్మియనగా సరస్వతీయాకు (వల్లారాకు)

సైంధలవణము కొడిశపాల మిరియాలు వీనిచూర్ణ మొక్కంత ఉష్ణోదకముతో పానమొనరించిన స్వరము బాగుగా గలుగును. ఇది రాత్రి పరుండబోవునపుడు పుచ్చుకొనవలయును.

కణతులకు—సీసము బిళ్ళజేసి కణతిపైనగట్టిన మెల్లగా కరగిపోవును. సీసము వెన్నలో సాది బూయుచుండిన కణతులు హరించును.

మేహములకు—ఏలకులు శిలాజతుభస్మము పిప్పళ్ళ కొండపిండివేళ్ళు వీటిచూర్ణము బియ్యపుకడుగుతో త్రాగిన మేహములు హరించును. దోసవిత్తులు, సైంధలవణము, త్రిఫలములు సమములు చూర్ణించి వేడినీటితోత్రాగిన మేహములు నివారణమగును. కరక్కాయ చక్కలు ౧, తాడికాయలు ౨,

ఉశిరకవరుగు 3, వీనిచూర్ణమొనరించి నేయి తేనెచేర్చి పుచ్చుకొనవలయును. తంగేడుచెట్టు సమూలము నెండించి చూర్ణముగావించి దానికి సమము ఉసిరకపప్పుచూర్ణము ఉసిరకచూర్ణమున కర్థము మాత్రిపసపు పొడుముగలపి తేనెతోగాని మజ్జిగతోగాని సేవించవలయును.

ఏలకులు శిలాజతుభస్మము హేమమాక్షికభస్మము యష్టిమధుకము త్రికటుకములు వాయువిడంగములు త్రిఫలములు యివి సమములు చూర్ణించి చూర్ణమునకు సరితంగేడు విత్తుల చూర్ణముగలపి పూటకు కర్షమువంతున తేనెతో బుచ్చుకొనవలయును.

దంతధావనకాష్ఠములు (పండ్లుతోముకొనుపుల్లలు)— మఱ్ఱియూడలతో దంతధావన మొనర్చిన దంతరోగములు హరించును. లేక కానుగు పుడకలతో పండ్లుతోముకొనుట మిగుల శ్రేష్ఠము. క్షీరవృక్షముల పుడకలు పండ్లుతోముట కుప యోగించవలయును.

పండ్లుతోముకొనుటకు చూర్ణములు.

౧ బొగ్గుపొడిలో ఉప్పు కొంచము జీలకర్ర శొంఠి కరక చక్కలు వీనిచూర్ణముజేర్చి దంతధావన మొనర్చిన అరోగ్యకరముగానుండును.

౨ తెల్లజీలకఱ్ఱ మిరియాలు శొంటి తెల్లకాచు లవంగాలు వేయించిన ధనియాలు సైంధలవణము మాజీఫలచర్మము

యెండినది యినుపరజము పొంగించిన మైలతుత్తము యివిచూర్ణమొనర్చి పండ్లుదోముకొనిన నొప్పులు దంతరోగములు హరించును.

౩ దిరిశనపువేరు మెత్తగా మర్దించి నొప్పికలిగినపంటి మీఁద బెట్టితే బాధతీరును.

౪ జీరకాదిచూర్ణము. జీలకర్ర, ఉప్పు కరక్కాయచక్కలు మూరుగముండ్లు యివిసమములు చూర్ణమొనరించి దంతములు తోముచున్నయెడ దంతచలనము దంతవ్యాధులు హరించును.

౫ యెండినమాజీఫలచర్మము ౦ ౪, శొంఠి తు ౦ ౪, బాదంచెక్కలు తు ౦ ౪, మిరియాలు తు ౦ ౪, కాచు తు ౦ ౪, సైంధలవణము తు ౦ ౪, పొంగించిన పటికె తు ౦ ౪, యివి పొడుముజేసి బెల్లం తు ౦ ౪, కలపి ఉదయ సాయంకాలములందు పండ్లకు రుద్దినదంతచలన మాగును.

౬ పిప్పళ్లు సైంధలవణము జీలకర్ర యివి సమములు పొడుముజేసి రుద్దిన వాపు రక్తస్రావము దంతములు కదలుట యివి మానును.

౭ అన్నభేది యింగువ కావిరాయి దేవదారుపట్టు యివి నీటితోనూరి మాత్రలుజేసి నోటిలోధరించిన దంతక్రిములు దంతశూలలు హరించును.

౮ జాపత్రి గలిజేరువేరు గజపిప్పళ్లు చెంగల్వకోష్టు వస శొంఠి ఓమము కరక్కాయలు నువ్వులు వీనిచూర్ణముతో

పండ్లను దోముకొనిన దంతశూల దుర్గంధము వాపు పురుగులు దురద చలనము యివి హరించును.

౯ కొబ్బరిపెంకులు కాల్చి పళ్లెరముపైనుంచిన తైలము దిగును. అది దంతములకు రుద్దిన నొప్పులు హరించును.

౧౦ శొంఠి ఉప్పు నూరి దూదిలో జేర్చి బెట్టిన చిగురువాపు హరించి బాధమానును.

పశిబిడ్డలపుష్టికి—ఆవుపాలతో వండి శుద్ధిజేసి యొంత బెట్టినపెన్నేరు గడ్డలచూర్ణము ఉదయకాలము మండలము దినములు ధారోష్ణ (అప్పుడు పిండినఆవుపాలు)తో త్రాగించిన బిడ్డలు చిక్కిపోవుటమాని పుష్టికలుగును.

స్తన్యపానవిషయము.

కం. చనుబాలులేకయుండిన
మనసోత్సాహముగ ద్రాపముగువలకొప్పగ
దినమును మేకలపాలును
ఘనతరవాచాలనంతు గానొనరింపగ

శ్రీబాలవైద్యసుధాబ్ధి రెండవభాగము సప్తమతరంగము.

తల్లిపాలులేనియెడల పశిబిడ్డలకు మేకపాలు ఆవుపాలతో పాలించవలశినదిగా ఆయుర్వేదము నందు జెప్పబడియున్నది.

గాడిదపాలు.

గీ. ఖరముపాలు ద్రాగ కాకజేసిననేమి
కాసలుబ్బసముల గండడంగు

నీరుచురుకులెల్ల నిర్మలపరుచును
ఆహికజ్వరంబులణచుదేవ.

## స్త్రీబాలవైద్యసుదాబ్ధి.

గాడిదపాలు స్తన్యములవలె తేలికగా జీర్ణించుననియు శిరపాణులు జ్వరములు ఉబ్బసములు మొదలగువాని బాపుననియు వైద్యగ్రంథములు దెలుపుచున్నవి. ఖరక్షీరము సన్నిపాతముల కూడాదొలగించును.

### మాటలు, తెలివితేటలు గలుగుటకు.

గీ. బ్రాహ్మిబోడతరంబు బిప్పలియు వసయు
శొంఠియు సమంబులుగ దూచి చూరజేసి
ప్రతిదినము రేపకడ సగబాలు తేనె
గలపి నాకెత్తుదినిన సూక్తులుఘటించు.

అప్పకవీయము.

వల్లారి (సరస్వతీ) యాకు బోడతరము, పిప్పళ్ళు, వస శొంఠి, యివి సమములు చూర్ణమొనరించి ఉదయ సాయంకాలములందు తేనెతో నాకించిన మంచిమాటలు గల్గును.

### వాక్శుద్ధికర వచాదిచూర్ణము.

జీలకఱ్ఱ, శొంఠి, ఓమము, సైంధలవణము, వస, యష్టిమధుకము, చంగల్వకోష్టు, కరక్కాయ, నేతితో పాకము జేసి బాలులకు దినిపించిన వాక్పటుత్వము గలుగును.

బాలాతిసారములకు.

కొడిశవిత్తులు. మారేడుగుజ్జు, ఆరెపువ్వులు, లొద్దుగ పట్ట, కురువేరు వీనిచూర్ణము తేనెతో నాకించవలయును.

శొంఠి, మారేడుగుజ్జు, పీసపొడుము బెల్లముతో కలపి దినుపించిన త్రిదోషగ్రహణులు అనగా వాతపైత్య శ్లేష్మగ్రహణులు గట్టును.

బాలుల జ్వరములకు.

ఫెరంఫాస్, నెం 3 రు గాని నెం 6 రు గాని యివ్వవలయును. నులిపురుగులకు నెట్రింఫాస్, నెం 3 రు దినమునకు ముమ్మారొసగవలయును.

పొంగుజ్వరము (ఆటలమ్మ తడపర)

ప్రథమమున ఫెరంఫాస్ నెం 6 రు దినమునకు ముమ్మారిన్వవలయును. పడిసెమున్నయెడల ఫెరంఫాస్ నెట్రింమ్యూరు వేరు వేరుగా నివ్వవలయును.

కం. కాలీసల్ఫును పొక్కులు
రాలినతరి వాడవచ్చు రససంఖ్యనుగా
నాలుగుమారులు దినముకు
పాలాంబోభక్తపక్ష పాలితయుమా.

శ్రీబాల వైద్యసుధాబ్ధి. ద్వితీయభాగము

కురువేరురసములో శర్కరగలపి త్రాగి తడపరలో పైత్యములు హరించును.

తుంగగడ్డలు, కరక్కాయలు, చేదుపొట్ల, వేపబొడిమలు, అతిమధురము వీనికషాయము త్రాగిన సర్వజ్వరములు హరించును.

కోరిందదగ్గు (తమకశ్వాసము కక్కు-వాయి దగ్గు.)

గీ. మర్రిజువ్విమేడి మద్దినేరేడులు
త్రికటువులతోడ తేనెగూర్చి
బాలకులకొసంగ ప్రకటంబుగా కక్కు-
వాయిదగ్గుడణగు వారిజాక్షి.

బాలవైద్యామృతం,

కరకచెక్కలు, ధనియాలు, గంటుభార్ఙి, పసపు, జిల్లేడువేరు, వస, అడ్డసరపాకులు, శొంఠి, యివి సమములు కషాయముబెట్టి త్రాపవలయును.

హోమియోపతి ఔషధవివరము శ్రీ బాలవైద్యసుధాబ్ధిలో బాగుగా తెలుపబడి యున్నది.

ఆదివారమునగాని, గురువారమునగాని, కోరిందచెట్టు నారగైకొని త్రాడువేసి, అయిదుగాని, యేడుగాని, ముడ్లువేసి పసపుబూసి, ధూపదీప నైవేద్యములిడి కంఠమునందు గట్టవలయును.

గవదబిళ్ళ (కమ్మకాక.)

ఇది చెవితమ్మెక్రింద వాచును. వాపుగనుపించిన వెంటనే

మూడు సున్నలుగా రక్షవేసిన సారించును. మంచి చికిత్స చిటికేశ్వరపాకు ఆముదములో వెచ్చజేసి కట్టవలయును. నల్ల మందు ౧ హారతికర్పూరం తు ౨ గుడి నూనె కొట్టిన సానె లోగలపి లేపన మొనర్చవలయును.

శక్తిపుష్టికి.

గీ. వెన్నశర్కరమాక్షిక వితతిగల్పి
బాలురకు బెట్టి పిమ్మట పాలుసాద
ములను దినుపించ తనుపుష్టిగలుగకున్నె
క్షయలు హరియించకున్నె సిక్కముగ శూలి.

శ్రీ బాలవైద్య సుధాబ్ధి దశమతరంగము.

వరిబీజము (ఒకేఅండము వాచుట.)

గచ్చాకు ఆముదములో వేయించి గట్టవలయును.

తెల్లగన్నేరాకు యుడికించి గట్టవలయును. సున్నము చింతపండు నూరి అండముపై గట్టవలయును.

గంటుభారంగి, కలి, (జొన్నకుసితి)తో సాదిగాని, రాతి సున్నము విభూతి ఆముదముతో నూరిగాని పట్టువేయ వలయును.

బుడ్డ (అండవృద్ధి)

గాడిదెగడపాకు, ఆవుపాలలో నుడికించిగాని తంగేడాకు గాని, ఉమ్మెత్తఆకుగాని, ఆవుపంచితములో యుడికించి గట్ట వలయును.

ఉత్తరేణువేరుసారము ఆవునేతిలో జేర్చి గాచి బిడ్డల కిచ్చిన అండవృద్ధులు హరించును. గందబేరోజ (బాలింతబోలు బంక) నల్లమందు యివి నూరి పట్టువేయవలయును.

కండ్లకలక (అభిష్యందము)

నిమ్మపులుసులో నూనెజేర్చి కన్నులకు బెట్టుటయొకటి. కనకటి విత్తనముల పొడిజేసి నీళ్లతోగాని లేకపొడిగాని కన్నులకు బెట్టుటయొకటి. పటికిపొంగించి నీటిలోజేర్చి కనులలోబోయుట యొకటి. మజ్జిగగాని బెల్లముపానకముగాని కన్నులలో వైచుట యివికండ్ల కలకలమాన్పును. యివి సాయంత్రమునసే జేయవలయును.

సర్వకామిలా చికిత్సలు. (పసికర్లు)—ముదివేపచక్క కషాయములోగాని త్రిఫల కషాయములోగాని తిప్పతీగె క్వాథములోగాని తేనెజేర్చి త్రాపినసర్వకామిలలు హరించును.

మడ్డివెలిగారమును సుభ్రిమొనర్చి పొంగించి చింతపండులో జేర్చి నూరి ౧౦ దినములు కుంకుడుగాయంత దినుపించిన కామెర్లు హరించును. మంచి ప్రక్రియ

బెల్లగలిజేసువేరు పాలలో నుడికించి శుద్ధిజేసి సాది కన్నులలో బెట్టిన కామిలలు హరించును. కామిలలు ముదిరిన నంజులోనికి దిగింపును.

బాలాజీర్ణములకు బొక్కెనాకుపొడుము—బొక్కెనాకు, పసకొమ్ము, లవంగాలు, శొంఠి, సుగంధిపాలపాట్లు, అక్క

లకర్గి, యాలకాయలు, పిప్పళ్ళు, జట్టివరగోగు, యివి పెంకులోమాడ్చి పొడుముజేసి భద్రపరచి చనుబాలతో బోసినయెడ బాలాజీర్ణములు చర్దులు కడుపుబ్బరములు పాలుగ్రక్కుట విరేచనములు గట్టును.

బాలసంజీవనీ మాత్రలు—శుద్ధిజేసి నేపాళపుపప్పు తు౧౺ శొంఠి తు ౧౺ పసుపుతు ౦౺ యివి నీళ్లతో నూరి పెసలంత మాత్రలగట్టి చనుబాలతో బోసిన జ్వరములు హరించును.

బాలసూర్యోదయము—నాభి, మిరియాలు, రససింధూరము, లవంగాలు, కస్తూరి, యివి సమములు. వీనిసమము యింగిలీకము యివి చనుబాలతో మర్దనమొనర్చి మాత్రలొనరించి అనుపాన విశేషములతో నొసంగిన సమస్తవ్యాధులు హరించును.

బాలమురారి—గోరోజనం (చప్పిడి) తు ౦౧, రససింధూరం తు ౧, చంగల్వకోష్టు తు ౧, లవంగాలు తు ౧ యివి రెండు మేకపిన్చుకల సోనతో మర్దనమొనరించి పెసలంత మాత్రలగట్టి చనుబాలతో నొసంగిన సర్వజ్వరములు హరించును.

దగ్గులకు—వాకుడుపూలు 3, లవంగాలు ౨, యివి పెంచుకలోమాడ్చి నూరి చనుబాలతోకలపి బోసిన దగ్గులు హరించును.

మిరియాలు, పిప్పళ్ళు, లవంగములు, యివి వేయించి పొడుముజేసి దుష్టపాకువాడ్చి పిండిన రసములోఁగలపి త్రాగించిన బాలులదగ్గులు మానును. కళ్ళె (శ్లేష్మము) తెగి పడును.

సదాపఆకు వాడ్చి రసముపిండి చనుబాలలో కలపి పోసిన దగ్గులు వాతము జ్వరములు హరించును. ఇది కస్తూరీతుల్యము.

బాలుచవ్వ చలిదితీటలకు—తాళకము, వస, వేపవేరు యివి ఆవుపంచితముతో నరుగదీసి వేపనమొనర్చ వలయును

చవ్వ (కరపాణి)—నల్లవుప్పివేరుచెక్క, వస, వెల్లుల్లిరెబ్బ, యివి ఆముదములోఁజేర్చి కాచి కొంచముత్రావిన కరపాణి పోవును.

వేపయిగురు మజ్జిగతోనూరి లేపన మొనర్చినను మిరపకాయలమసిని నీళ్ళతోనూరి బూసినను కరపాణి మానును.

మాదిగవాని కొమ్ములో మాగినకొవ్వు, జీలకర్ర, యివి ఆవునేతిలోవైచి కాచి కాకియీకచే బ్రామిన విసర్పులు మానును.

కుక్కగిగ్గెరాకు కొంచము బండారు (బియ్యముకపసపునూరినపొడి) వెన్నతోనూరి బూసిన చలిదిమానును.

బాలుల వాంతులకు—పేలాలు, ప్రత్తివిత్తులలోపప్పు పలుకులు, వేయించిన పిప్పళ్ళు, యివి నూరి తేనెలో నాకించ వలయును.

మారేడువేరు గంధముదీసి ఏలకుల పొడుముగలిపి నాకించిన వాంతులు మానును.

పిప్పళ్ళపొడుము, వరిపేలపిండి, యివి తేనెలోగలిపి కొంచము శర్కరజేర్చి నాకించ వలయును.

పమిడిపత్తికాయ కుమ్ములోబెట్టి వాడ్చి రసముదీసి చనుబాలలోగలపి కొంచము తేనెజేర్చి త్రాగించవలయును.

నన్నిపాతవాంతి హిక్కలకు—నేలవెలగాకు ఏలకులు ధనియాలు యష్టిమధుకము చవ్యము సుగంధిపాలపొట్టు వట్టివేళ్ళు యివి కషాయము గాచి త్రాగించవలయును.

మలబద్ధములకు—బెల్లము పసపు యివి నూరి శనగగింజంత వెన్నలో గలపి నాకించిన మలబద్ధకము లణగును.

రససింధూరము ఓమము వేపయిగురు యివి నూరి మాత్రలొనరించి చనుబాలతో పోసిన అజీర్ణము లణగును.

స్తన్యదోషములకు—పసపు మ్రానిపసపు బియ్యపుగింజలు వాకుడు యష్టి మధుకము యివి కషాయముగాచి తల్లి బిడ్డలు పానముజేయవలయును.

గీ. కటుకరోహిణి భూనింబ కొటజములు
చాగమధుపర్ణితుంగముస్థలునుశొంఠి
గ్రాలుసురదారు నల్లసుగంధిపాల
పాశ చనుబాల దోషముల్ పారదోలు.

శ్రీబాలవైద్యసుదాబ్ధి సప్తమతరంగము,

తృతీయసోపానము

తా॥ కటుకరోహిణి నేలవేము కొడిశ
గడ్డ తిప్పతీగ తుంగగడ్డలు శొంఠి దేవదారు నల్లసుగంధ
చిరుబొద్ది వీని కషాయ మివ్వవలయును. (తల్లికి)

చంటిబిడ్డలఅజీర్ణ భేదులకు—రసకర్పూరం యినుపగరిటె లోవైచి చనుపాలుబోసి ఉడికించినసుద్ధియగును. దానిని వైకొని శనగగింజంత సున్నము చాలినన్ని తమలపాకులతొడిమలుజేర్చి మర్దించి మాత్రలు గట్టవలయును. ఇవి బిడ్డలకు బోసిన అజీర్ణ భేదులు వాతములు హరించును.

ఆవాలు బొక్కెనకాయలు సుగంధపాల వేరుపట్ట యివి సమములు వెచ్చజేసి ఆకుజముడాకులుకాచిపిండిన రసముతో మర్దించి కుంకుమపువ్వు కస్తూరిజేర్చి నూరి మాత్రలు జేయవలయును. ఇవివాడిన అజీర్ణములు జ్వరములుహరించును.

కస్తూరిమాత్రలు—వేయించిన మిరియాలు తు ౧ వేయించిన పిప్పళ్ళు తు ౧ వెచ్చజేసినశొంఠి తు ౧ చనుబాలుతోనుడికించి సుద్ధిజేసిన యింగిలీకము తు ¼ నిప్పుపైకాచిన రసకర్పూరం తుం ¼ రససింధూరము తుం ¼ లవంగాలు తు ¼ అక్కలకర్ర తుం ¼ జట్టివరగోగు తు ¼ యివి చూర్ణమొనరించి కస్తూరి ౨ కుంకుమపువ్వు తుం౹ గోరోజనముచి౨ జున్ను చి౨ పావుదారచి ౨ రొయ్యపొట్టుచి౨ యివిజేర్చి మునగ వేరుచక్కరసము వావిలాకురసము అల్లపురసము గుంటగల్గర

...లరసము వీనితోనూరి పెద్దఆవాలంత మాత్ర
...డినసమస్తవ్యాధులు హరించును.

జెట్టకు—ఇది లేచుటకుప్రారంభించగానే నిమ్మకాయకు రంధ్రముజేసి వ్రేలికి తొడగి అచ్చట రక్తముజచ్చి వ్రేలు తెల్లబడువరకు నుంచవలయును. చవుడు సున్నము గట్టి మంట బుట్టకుండ నీరుతో తడుపుచుండవలయును.

చెమటగుల్లకు—పసపు సున్నము నీరుతో యుడికించి లేచుటకు మొదలుబెట్టగానె నాలుగు, మూడు కల్లుగట్టిన సమసిపోవును.

కుసుమరోగము (అస్రృగ్దరము, చీరెరోగము)—ఇయ్యది అతిమైధునముచేతను రక్తపైత్యముచేతను కలుగుచున్నది. ఉపవాసములు విశేషముగా కూరల భుజించుటవలన గలుగుచున్నది.

వేంఖపత్రాదికషాయము—వెమరాకు కూతురుబుడమ (నక్కదోస) వట్టివేళ్ళు, దానిమ్మకాయ చెక్కలు, తుంగగడ్డలు కురువేరు ఖివి సమములు కషాయము గాచి త్రాగిన కుసుమములు హరించును.

లవంగాదిచూర్ణము—లవంగాలు తు ౦౪, శొంఠి తు ౦౪, జిలకర్ర తు ౦౪, నల్లజిలకర్ర తు ౦౪, మిరియాలు తు ౦౪, సుగంధిపాల తు ౦౧, యర్రకలువగడ్డ తు ౦౧, వీని

చూర్ణములో పంచదార గలపి నెయ్యిగలిపి పూటకు తు ౨ వంతున భక్షించవలయును.

తామరపూలు యష్టిమధుకము, తామరరేకులు, మంచి గంధము యివి చూర్ణముజేసి తిప్పసత్తు పంచదారగలపి బియ్య పుకడుగుతో నూరి యెండబెట్టి చూర్ణమొనరించి శర్కర సమ ముగా కలపి పూటకు తులమువంతున బుచ్చుకొనవలయును.

అడ్డసరపాకు రసములో తిప్పతీగెరసము గలపి పానము జేసిన తెల్లకుసుమరోగము హరించును.

ఉత్తరేణు ఆకులు, మిరియాలు నూరి పెరుగుతో సేవిం చిన అస్వగ్దరములు హరించును.

నల్లఉప్పిచక్క తు ౨, వెల్లుల్లిరెబ్బలు తు ౨, యివి నూరి ౮ తులముల ఆవుచల్లతో త్రాగిన రక్తకుసుమములు హరించును.

ఉ. వేపచిగుళ్లు మిర్యములు వీటిని మెత్తగనూరి మాత్రలన్
యూపికగట్టి నేడెపెరు గొప్పగగూరిచి రెండుపూటలన్
ద్రాపిన వారమందు మరి దప్పకమానున సృగ్దరంబులో
గోపతివాహభీమ సుర కోటివిపక్ష విదారభూరథా.

శ్రీ బాలవైద్య సుధాబ్ధి పదిథమ భాగము.

తెల్లబాడిదె చక్క రసములో శర్కరగలపి త్రాగిన రక్తప్రదరములు హరించును.

పమిడిపత్రిత్తాకురసము మేడిచక్కరసము వీనిలో వరి పిండిగలపి రొట్టెను జేసి గాచి భక్షించవలయును. తెల్లకుసుమము హరించును.

కుసుమవ్యాధులకు యునానిచికిత్సలు—కర్పూరశిలాజతు భస్మము, కావిరాయి, యివి సమములు. పూటకు ౬ మాషలు నీటిలోగలపి త్రాగవలయును.

పెన్నేరుగడ్డ చూర్ణము కలకండపొడుములో గలపి పూటకు తులమువంతున బుచ్చుకొనవలయును.

రసూత్, తుమ్మబంక, తెల్లగుగ్గిలము, యివిమాష ప్రమాణములు, వక్కలు మాషలు ౨ ౻, యివి నీళ్లతో నూరి మాషయెత్తు బిళ్లలుజేసి ౨-3 బిళ్లలు పుచ్చుకొనిన కుసుమములు హరించును.

ఉక్కడ్రావకముయొక్కగుణము శ్రీబాలవైద్యసుధాబ్ధి పు110

క. రక్తపుష్టినొసగుచు రాజిలంగి
బుతుమతిని జేసి నీరసగతిని బాపు
షాలిపోయినవారికి బలముదెచ్చు
స్త్రీలకెంతయుమంచిది స్టీలుడ్రావు.

మోనిశూలలు—వేపవిత్తులు, ఆముదపుగింజలపప్పు యివి సమములు వేపాకురసముతోనూరి గుడ్డకుబట్టించి వత్తిగాజుట్టి మోనియందు ధరించిన శూలలు హరించును.

గాడిదెగడపాకు, ఉప్పు, యివి నూరి పెంకులో వేయించి భస్మము జేసి శొంఠిచూర్ణముతో గవ్వెత్తు బుచ్చుకొనిన ముట్టు కుట్టులు నయమగును.

మూరుకొండాకు, ఏకవెల్లుల్లిపాయ, మిరియాలు, యివి సమముగానూరి బహిష్టు మూడుదినములు సేవించిన ముట్టు శూలలు హరించును.

ముట్టురక్తము గడ్డకట్టినందుకు—మునగాకు గుప్పెడు, నేయి తులములు జేర్చి మిరియాలు తులము యివి వేయించి బహిష్టుకు పూర్వమే వారము దినములకుమునుగు ప్రారంభించి భక్షించవలయును.

దుర్గంధరజోరక్తమునకు స్త్రీబాలవైద్య సుధాబ్ధి

గీ. వట్టివేరులు యింగువ వహ్నిమూల
ములను కల్కముగావించి కలపి యావు
నేత పానము జేయించి నిర్మలమగు
దుష్టదుర్గంధ యార్తవ దోషమిలను.

వహ్నిమూలము=చిత్రమూలము

బహిష్టు సక్రమముగానొనరించుటకు స్త్రీ. వై.

గీ. తెల్లజిల్లేడుపువ్వులు బెల్లమందు
వైచి మర్దించి మాత్రల పరుసజేసి
మొసగ ఋతుమతియగును నింపెసగ దేవ
బృందనుతగుణ సందోహ సంవిహార.

గీ. తెల్లగలిజేరు మూలముల్ దెచ్చి నూరి
గుడ్డమునుబూసి యట్టుక కుదురుగాను
యోనియందునబెట్టుచునున్న మట్టు
కలుగు భూతలమందున గరళకంఠ.

వంధ్య (గొడ్రాలి) లకు—విష్ణుక్రాంత సమూలము నీడనెండించి చూర్ణముచేసి బఱ్ఱెపాలతో తడపి ఆరబెట్టి గేదెవెన్నతో నేడు దినములు ఋతుకాలమందు సేవించిన కాక వంధ్యాస్త్రీలు గర్భముధరించి సంతానవంతులగుదురు. మంచి ప్రక్రియ.

కం. తామరగడ్డలు శర్కర
కోమలమారుత్తిలలుగొట్టి చూరగా
నేనుకు తేనెతో గ్రోలిన
భామలుగర్భముధరింతురు భావజహరణా.

స్త్రీబాలవైద్యసుధాబ్ధి తృతీయతరంగము పు 123.

తా॥ తామరదుంపలు మెరిసినువ్వులు యివిచూర్ణము చేసి పంచదారగలపి తేనెతో బుచ్చుకొనుచుండిన గర్భవతులగుదురు.

ద్రాక్షాదిచూర్ణము—ద్రాక్ష దానిమ్మపండుచెక్కలు ఖర్జూరఫలములు శొంఠి పిప్పళ్ళు మిరియాలు కొబ్బరి మంచి గంధపుచెక్క యష్టిమధుకము ఉసిరకవరుగు చారపప్పు ఏలకులు, లవంగాలు, లవంగపత్రి, నాగకేసరములు కురువేరు వట్టివేళ్ళు జాపత్రి నేలగుమ్ముడుగడ్డ పల్లేరుగాయలు అరటిగడ్డ

దుగదగొండివిత్తులు జాజికాయ తక్కోలపుల్లు చెంగల్వకోష్టు మినుములు, నువ్వులు, వెదురుబియ్యము యవలబియ్యము లొద్దుగపువ్వు తుంగగడ్డలు జిబిలికవేళ్ళు జనపవిత్తులు నల్లజీలకఱ్ఱ తెల్లజీలకఱ్ఱ అజామోదము మెంతులు తాళిసపత్రి సైంధవలవణము ధనియాలు గంటుభారంగి కర్కాటకశృంగి గుంటగలగర మొదలెట్టినది గలిజేరువేళ్ళు జీడిపలుకులు మామిడిపికలు కులు యివి చూర్ణమొనరించి అభ్రకసింధూరము ఒకభాగము కలిపి చూర్ణమునకు రెండింతలు పంచదారకలిపి కర్షమెత్తు ఆవుపాలతోగాని ఆవునేతితోగాని ఋతుకాలము మొదలు నాలుగుమాసములు ఉదయసాయంకాలములందు సేవించిన రక్తపిత్తములు కుసుమవ్యాధులు, పాండు కామి లావస్సులు మూత్రకృచ్ఛములు హరించును. దీర్ఘాయుష్మంతులగు సంతానము వడయుదురు. శొంఠి పిప్పళ్ళు మిరియాలు నాగకేసరములు యివిచూర్ణముగావించి ఆవునేతితో మూడుదినములు ఋతుకాలమందు సేవించిన గర్భము ధరించి సంతానవంతులగుదురు.

కం. తెలివెంపలిమూలంబులు
తులమునుచూర్ణించి గోవుదుగ్ధంబులచే
వెలదులు త్రాగినగర్భము
కలుగదె ముక్త్యాలవాస కలుషవినాశా.

గర్భస్రావము(గర్భమునిలువనందుకు)—రాజనపుటియ్యా పుపిండి పంచదార వీనిచూర్ణమును మేడిచెట్టుయూడలకషాయ ముతో గ్రోలినగర్భస్రావమాగి గర్భమునిలుచును. యష్ఠిమధుక ము తామరదుంపలు చూర్ణమొనరించి పంచదారగలపి యుదక ముతో త్రాగిన గర్భస్రావము మంటలు హరించును.

గర్భిణీవాంతులు (వేవిళ్ళు)—వేడిపేటిలో నిమ్మపులుసు జేర్చి తత్తానుగుణ్యముగా బుచ్చుకొనవలయును.

యష్టిమధుకము వట్టివేరులు వీని కషాయములోగాని పంచదార గలపి సేవించిన వాంతులు దాహము నయమగును.

క. వరిపేలంబులు బిల్వము
కరువేరును వట్టివేర్లు గూర్చి యుకల్కా
బుపవడిత్రాగిన చర్దులు
హరియించును గర్భిణులకు హరివినుతహరా.

వడ్లపేలములు, మారేడువేరుచెక్క కురువేరు వట్టివేర్లు యివికల్కముజేసి పానముజేసిన గర్భిణుల వాంతులు హరిం చును.

## స్త్రీ బాలవైద్య సుధాబ్ధి చతుర్థతరంగము.

గర్భిణీ అగ్నిమాంద్యమునకు—వాము పెన్నేరుగడ్డ యలకరసి పిప్పలిమోడి యివి చూర్ణమొనరించి బెల్లముపాకము లో గలపి భక్షించవలయును.

గర్భిణివాతమునకు (విరేచన బద్ధకము)—దేవదారు మత్తునపులగము దుంపరాష్ట్రము శొంఠి ఆముదపువేరు యివి కషాయముగాచి కొద్దిగా ఆముదముజేర్చి పానమొనర్చిన వాత నొప్పులు హరియించును.

గర్భిణిల దగ్గులకు—మారేడుకాయగుజ్జులోవరిపేలాల పిండి గలపి నీరముతో త్రాగిన కాసహరించును.

అహింపత్యచూర్ణము—శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, తుంగగడ్డలు ఉసిరకవరుగు ఆకుపత్రి దాల్చినీపట్ట వాయువిడంగములు కరకచక్కలు ఏలకులు యివిసమములు తెల్లితెగడ మూడుభాగములు యివి చూర్ణమొనరించి శర్కరచూర సరిగాగలపి సేవించిన వాతపైత్య కఫములు గర్భిణులశూలలు క్రిములు కాసలు అగ్నిమాంద్యములు మేహములు యివి హరించును.

## మాసమాస గర్భవేదన చికిత్సలు.

౧ యష్టిమధుకము ద్రాక్ష ఎఱ్ఱచందనము చందనము యివి చూర్ణమొనరించి ఆవుపాలతో ద్రాగిన ప్రథమమాస గర్భ వేదన హరించును.

౨ తామరతూళ్ళు నాగకేసరములు యివినూరిపాలతో ద్రాగిన రెండవమాసవేదన హరించును.

౩ శ్రీగంధము గ్రంధితగరము చెంగల్వకోష్టు తామర తూళ్ళు తామరఅగరులు యివినూరి పాలతోఁదాగిన మూఁడవ మాసవేదనము హరించును.

౪ తామరతూళ్ళు పల్లేరుగాయలు నల్లకలువగడ్డలు వట్టివేళ్ళు అరటిగడ్డ యివి పాలతోనూరి రసముదీసి పానమొనరించిన నాల్గవమాస వేదనము తొలంగును.

౫ తామరతూళ్ళు రేగాకులు నాగకేసరములు నల్లకలువదుంపలు యివి నీటితోనూరి రసముఁగైకొని పాలతోఁదాగిన ఐదవమాస వేదన హరించును.

౬ మాజిష్టి వెలగపండుగుజ్జు యివి నూరి పంచదార జేర్చి పాలతో పానమొనరించి యారవ మాస గర్భవేదనము తొలంగును.

౭ వట్టివేళ్ళు యేనుగుపల్లేరుగాయలు తుంగగడ్డలు మంజిష్టి నాగకేసరములు తామరతూండ్లు వీనికషాయములో పంచదారగలపి గ్రోలిన యేడవమాసవేదనము హరించును.

౮ యష్టిమధుకము మెట్టదామర గచ్చపప్పు తుంగగడ్డలు నెమ్మునటములు గజపిప్పళ్ళు నల్లకలువగడ్డలు యివి పాలతో నూరి పానముజేసి యెనిమిదవమాస వేదనముతీరును.

౯ యష్టిమధుకము దురదగొండివేళ్ళు సుగంధిపాలవేరు పొట్టు యివి పాలతోనూరితాగిన తొమ్మిదవమాసవేదనము హరించును.

## గర్భస్రావచలనములకు మాసచికిత్సలు

౧ యష్టిమధుకము శాకబీజము క్షీరకాకోళి దేవదారు.

౨ అశ్మంతకము నల్లనువ్వులు తామ్రవల్లి పిల్లిపీసర.

3 ముయ్యాకుపొన్న (అత్తపత్తి) క్షీరకాకోళి నల్లకలువ సుగంధిపాల.

౪ తీటకసింద నల్లసుగంధిపాల సన్నరాష్నము తామర పూలు యష్టిమధుకము.

౫ పెద్దవాకుడు చిన్నవాకుడు నేలగుమ్ముడు క్షీరకాకోళి గుమ్ముడు లవంగపత్రి.

౬ కోలపొన్న, చిట్టాముట్టి, మునగచెక్క, యేనుగపల్లేరు, గుమ్ముడు.

౭ శింగాడికాయలు, తామరగడ్డ, ద్రాక్ష తుంగగడ్డలు, యష్టిమధుకము, శర్కర.

౮ వెలగ, మారేడు, వాకుడువేళ్ళు, చేదుపొట్ల, చెరుకు, పెద్దములక.

౯ యష్టిమధుకము, దూలగొండి, కాకోళి, సుగంధిపాల.

౧౦ శొంఠి, క్షీరకాకోళి.

౧౧ తవాక్షీర, నల్లకలువగడ్డ, మంజిష్ఠి, ఉశిరికవరుగు, కరక్కాయ.

౧౨ తెల్లగుమ్ముడువేరు, తేల్మణి, క్షీరకాకోళి, సుగంధిపాల

ఈపదిరెండు నెలలకుజెప్పియున్న దినుసులు నలగగొట్టి పాలలోవైచిగాని కషాయముగాచి పాలలోజేర్చిగాని కషాయములుగాని ఆయామాసములకు పానము జేయించవలయును.

గర్భశూలలు స్త్రీబాలవైద్య సుధాబ్ధి పు ౧౩౬

కం. తామరదుంప రసంబున
యామిని శర్కరలజేర్చి యతివలుద్రాగన్
నీమహిగర్భస్రావము
భీమంబగు శూలలణగు విశ్వాపేశా.

తా॥ తామరగడ్డ రసములో పసపు పంచదార జేర్చి త్రాగవలెను.

క్రిమిశూలలు—భావంచివిత్తులు దేవదారు పసపు వేపాకు యివినూరి యోనియందు లేపనమొనర్చిన శూలలు హరించును.

శొంఠి, మాదేడువేరు, ముత్తువపులగము, యివి కషాయముగాచి సైంధలవణము వేల్చిన యింగువ పీనిపొడుము నెయ్యి గలపి త్రాగిన గర్భిణీశూల లణగును.

సుఖప్రసవమునకు—వస, పిప్పళ్ళు, యివి సెట్టిలో నూరి నాభిచుట్టును బూసిన సుఖముగా నీళ్ళాడును.

మక్కలకరోగచికిత్స—మావి (మైల) బాగుగా వెడల కుండిన వస్తియందు గ్రంధులు శూల మూత్రబంధకము మొదలగు గుణములు కలుగును. దీనినే మక్కలక రోగమని చెప్పబడియున్నది.

శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, దాల్చినపట్ట, లవంగపత్రి నాగకేసరములు, ఏలకులు, ధనియాలు, వీనిచూర్ణము పాత బెల్లముతో భక్షింప వలయును.

సూతికారోగము (బాలింతగుణము)—ప్రథమసోపానములో వివరించి యున్న విడియము ప్రసవించిన వెంటనే యివ్వవలయును. లేనియెడ మంచి యింగువ ఘాంగించి యివ్వవచ్చును. కొందరు రసకర్పూరపుబిళ్ళల పొట్లములు గట్టి తెలిసినవారు నూరి మాటుబెట్టిగాని మ్రింగింతురు. స్నానాంతరము మోడికారము ఒకమాసముగాని రెండుమాసములుగాని దినుపింతురు. ఇది మిగుల మంచిది. మోడికారము దినుసులు ప్రథమ సోపానమున చూడనగును. కొందరు బ్రాందిని త్రాగింతురు. యిది మంచిదేగాని పాలు పడవని వాడుక.

వజ్రకాంజికము—పిప్పలి, మోడి, చవ్యము, శొంఠి, ఓమము, జీలకర్ర, నల్లజీలకర్ర, పసపు, మ్రానిపసపు, బిడాలవణము, సౌవర్చలవణము, యివి పొడుమునర్చి కలిలోగలపి కాచి బాలింతల కొసంగిన సూతికావాతము శూల మొదలగునవి నివారణ యగును.

సూతికలకు కషాయమాత్రలు—చిత్రమూలము, దాల్చినపట్ట, నీలియాకు, తుంగగడ్డలు, వీని కషాయములో తేనెగలపి పానముజేసిన సూతికారోగములు హరించును.

ఏకవెల్లుల్లిపాయలు, మిరియాలు, ఏలకులు, నీరుల్లిపాయ యివినూరి చింతవిత్తులంతటి మాత్రలజేసి సేవించిన సూతికావాతములు నయమగును.

మోడిపిప్పళ్ళు, కారుమునగచెక్క, శొంఠి, తిప్పతీగె, చవ్యము, చిత్రమూలము, వీని కషాయముగాచి త్రాగిన సూతికావాతములు హరించును.

శ్రీ బాలవైద్య సుధాబ్ధి పు168

గీ. భృంగిమూలంబులును వస వెల్లిపాయ
రెబ్బలును శొంఠిసోమము రూఢిగా క
షాయమునుగాచి సేవించ బాయసూతి
కాబుజలు శీఘ్రకాలమే కాలకంఠ.

భృంగిమూలములు = గుంటగలగర వేళ్ళు తక్కినది స్పష్టము.

యూనానిచికిత్స—అక్కలకర్ర తు ౧, మిరియాలు తు ౧, వట్టివేళ్ళు తు ౧, గోరోజనం చిన్నములు ౪, ఆదిబచ్చికాని చి౪, పావుదారు చి౪, రొయ్యిపీత చి ౪, కస్తూరి చి౨, యివి ఆకుజము డాకు రసముతోగాని లేక జిట్టవరగోగు రసముళ్ళో గాని దుష్టుపాకు రసముతోగాని యీమూడు రసము.

లతోగాని మర్దించి మాత్రలుజేసి అనుపాన విశేషములతో సేవించవలయును.

బృహత్సూతికా వినోదరసము—శొంఠి భా ౧ మిరియాలు భా ౨ పిప్పళ్ళు భా ౪ పాదర లవణము భా ౪ ౻ జాజిమొగ్గలు భా ౨ వేల్చిన మైలతుత్తరము భా ౨ యివి వావిలాకురసముతో నొక ఝాముమర్దించి మాత్రలొనరించి తేనెతో సేవించిన సూతికా వాతములు హరించును.

సూతికా రోగమునకు పరమహంస క్రియ—వేయించిన పిప్పళ్ళు వరహామెత్తు వెచ్చజేసిన అక్కలకర్ర వర ౧ ౻ యింగువ వ ౧। బాలింతబోలు వ ౧ ౻ వెల్లుల్లిపాయ రెబ్బలు వ ౧ ౻ గోరోజనము పావలామెత్తు రెడ్డివారినాన బాలాకు పెద్దపిడికెడు యివి బాగుగా మర్దించి గచ్చకాయంత మాత్రలు తొమ్మిదిచేసి ఝాముకొక మాత్రవంతునయొసగి దాహ మడిగినప్పుడు కొర్రగింజల జావ నివ్వవలయును దాహము వళ్ళునుటయు సూతికా వాతము యివిహరించును.

బాలింతల దాహమునకు—బొక్కెనాకు వస వాము వేపవిత్తులపప్పు మిరియాలు పగులగొట్టి యివి నాలుగు పెంచు కలోజేర్చి మాడ్చి నీరుబోసి దించి పడియబోసి అప్పుడప్పుడు దాహపుచుండిన సూతికా వాతము హరించుటయే గాక గర్భకోశమును శుద్ధి నొనర్చును.

మైలతుత్తరము పెరుగుతోనూరి పెంకులోజేర్చి వేయించిన శుద్ధియగును.

బాలింతలకుపడే చీముకట్టుటకు—కుంకుమ పువ్వు × ౧ బాలింతబోలు × ౨ ముసాంబరము × 3 వీని నూరి మాత్రలీయ వలయును. × గుర్తు వరహాలు వేయుచుందురు.

స్తన్యదోషములకు—అగరు శొంఠి చాగ సీమునేల వేము దేవదారు శొంఠి కొడిశవిత్తులు సుగంధపాలవేరుపట్ట గ్రంధి తగరము కటుకరోహిణి వీని కషాయము తల్లికొసంగిన స్తన్యదోషములణగి తల్లిబిడ్డల కారోగ్యము కలుగును.

పాలు పడుటకు—నేలగుమ్ముడు గడ్డను పాలతో నూరి రసముదీసి పంచదారకలపి పానమొనర్ప వలయును.

మదనాసబకాగు (బొబ్బాయికాయ) తెలికపిండి యివి కలపి కూరవండుకుని భక్షించిన పాలుపడును.

పిల్లిపీచరవేళ్లు పాలతోనూరి త్రాగినను పాలుపడును.

అక్రోటు ఆకులు గోధుమరవ్వ యివి సమములు పిసికి ఆవునేతిలో పూరీలుగావండి ఏడుదినములు భక్షించిన పాలు బడును.

బాలింతనంజుల (శోఫ) కు వాడుకలోనున్న మాత్రలు—పొంగించిన లవంగములు వేయించిన పిప్పళ్ళు రేవల్చిన్ని పాలు సన్నిరాస్నము మండూరభస్మము రజతలోహరసాయనము ప్రతాప లంకేశ్వరము వాతరాక్షసము యివి మెత్తగా నూరి

తేనెలో మర్దించి మాత్రగట్టి అనుపాన విశేషములతో వాడవలయును.

గీ. కటుకరోహిణి గజ్జేరు కరకపండ్లు
సోమలత వేపవేళ్లును శొంఠి ద్రాని
పసుపు త్రికపటోలంబు క్వాథమెలమి
బెట్టిపానంబు జేయించ దిట్టమైన
నంజువ్యాధులు పాండువుల్ నయముగాదె.

స్త్రీబాలవైద్య సుధాబ్ధి పు 176.

తా॥ సోమలత=తిప్పతీగె. త్రికపటోలము=చేదుపొట్ల

పునర్నవాది కషాయము—చిత్రమూలము కరక్కాయ చక్కలు జెముడుచక్క యుప్పిచక్క శొంఠి గజ్జేరు వేళ్ళు యివి గోమూత్రములో కషాయముగాచి త్రాపిననంజులుహరించును. ఇవి మిగులఉష్ణము గావించును. జాగ్రతగా వాడవలయును.

స్త్రీ. వై. అన్నము యిష్టము లేనప్పు డివ్వవలసిన ఆహారము.

కం॥ మిరియాలు హరెళ్లను
నుల్లమురంజిల్లనివ్వ నొప్పును దేనిన్
సల్లలితంబుగ రోగుల
మెల్లగబోషించ శోషమించక నుండన్.

ఆవుపాలు రాత్రిపూట వాడవచ్చును.

యోనిరోగములు. పరిషేచనమునకు (కడగుట)

గీ. త్రిఫలములు దంతివేళ్ళను తిప్పతీగ
క్వాథమును బెట్టి గోరెచ్చగానుజూచి
యోనిషేచన మొనరించ మానినులకు
శూలలెల్లను మాయమా శూలపాణి.

స్త్రీ. వై. పు 195.

త్రిఫలములు (కరక ఉశిరక తాడికాయలు.) తక్కినది సులభము

యోనిశూల నివారణ పిచువు—గ్రంధి తగరము పెద్దములక చంగల్వకోష్టు సైంధలవణము దేవదారు యివి సమములు కల్కముగావించి నువ్వులనూనెలోజేర్చి కాచి దానిలో ప్రత్తినితడిపి యోనియందు ధరించిన శూలలు హరించును.

వచాద్యప యోగము—వస, నల్లజీలకర్ర జీలకర పిప్పళ్ళు అడ్డసరము సైంధలవణము వాము యవక్షారము చిత్రమూలము పంచదార యివి ప్రసన్నమను మద్యముతో నూరి నేతిలోవైచి వేయించి సేవించిన యోనిశూలలు రొమ్మునొప్పి గుల్మార్శస్సులు మొదలగునవి హరించును.

యోని గట్టి పడుటకు.—వేపవిత్తుల పప్పు తిలతైలములో జేర్చి కాచి విత్తుల పరిహరించి వెచ్చగానున్నపుడు పూసిన పైత్యయోనివ్యాధి హరించును. మునగపువ్వులు కాచు జాజి

కాయ కరకచక్కలు మాజీఫలములు వగరు పోకలు యివినూరి యోనియందుధరించిన బిగువుగానగును.

గర్భిణీ సూతికలకు హోమాపతి చికిత్సలు.

గీ. గర్భధారణమాదిగా కాలిఫాసు
షష్టచూర్ణము దినుచుండి యిష్టముగను
దానితోమధ్య మధ్యను దుగునుక్యాలి
కేరియాష్టవ రొప్పును నారుసంఖ్య
స్త్రీబాలవైద్యసుధాబ్ధి పు. 182.

తా. గర్భము ధరించినది మొదలు నెం ౬ రు కాలిఫాస్ వాడుచు మధ్య మధ్య క్యాలికేలియాష్టవరు వాడుచుండ వలయును. రక్తస్రావము గట్టును.

గర్భధారణమాది నెం ౬ రు కాలిఫాస్ పుచ్చుకొను చుండిన స్నాయువుల దుర్బలత్వము చక్కబడుటయే గాక సుఖముగా ప్రసవించును.

కం. ఘనక్యాలి కేరియాఫా
సును షష్ఠమ మర్దనముల చూర్ణముసంగ్రహ
తనువుకు బలమింపొందును
కనకాచల చాపసోమ ఖండకలాపా.

గర్భస్రావ ప్రక్షాళనము.—గర్భస్రావమైన పిమ్మట 3 మర్దనల సెరంపాస్ గ్రె ౩౦ లు పౌను యుష్ణోదకములో గలపి యోని ప్రక్షాళనమొనర్చుకొన వలయును. రోగిని తిరుగ

నివ్వాళ పరుండబెట్ట వలయును. బియ్యపుజావగాని, పాలు, గంజి, ఫలములు పీని యొసగవలయును.

వేవిళ్ళు (గర్భిణీవాంతులు)—వమనమునందు ఆమ్లముండినయెడ నెట్రింపాసు 3 మర్దనల చూర్ణమొసగవలయును. మూడు మర్దనల నెట్రింనల్పునొసంగిన పైత్యవమనములు హరించును. ౬ మర్దనల నెట్రిం మ్యూరు గైకొనిన నీరు గ్రిక్కుట చక్కబడును.

పథ్యము స్త్రీ - వై - పు 182.

గీ. పాలుద్రాగవచ్చు పండ్లు మెక్కగవచ్చు
కరము సులభ జీర్ణకారివస్తు
చయముభోజనంబు సలుపగవచ్చును
మిత్రచంద్రనేత్రి మిత్రిగాంగ.

విరేచనబద్ధకమునకు. ఆరుమర్దనల క్యాలికేరియాప్లవరు గొనుచుండిన విరేచనబద్ధక మణగును. మూడుమర్దనల ఫెరంఫాసు వేడినీటగలపి యోని గడిగిన స్రావవేదనమణగును. ౬ మర్దనల క్యాలికేరియాప్లవరు వాడిన చెడురక్తము వెడలి ఆరోగ్యము కలుగును. ౬ మర్దనల క్యాలికేరియాఫాస్ దినమునకు నాలుగుసారులు ద్రాపిన ఆకలి గలుగును.

సూతికాజ్వరమునకు స్త్రీ. వై. 183.

సీ. ప్రథమంబునను ఫెరంఫాసుకాలీఫాసు
షష్టమర్దనముల సల్పువాటి

గలపిద్రాగించుచు క్రమముగానాపైన
సట్టికాలీమూరు పట్టియొసగ
మేలగునిదాహము మిక్కిలిగానున్న
యెడల కాలీమూరు హెచ్చకుండ
గలపినెట్రింమ్యూర్రు కరముద్రాపించుచు
పొట్టకు నావిరి బట్టవలయు
గీ. కాపుకాయంగ వలయును కాంతకెలమి
పట్టావేయంగ నగుఫెరం ఫాసుమూడు
మర్దనంబుల దానిని మంచిపాలు
ద్రాపగానగు నోలింగ దనుజభంగ.

పాలుబడుటకు యూనాని చికిత్స—ఎఱ్ఱబియ్యము (వెలవడము) తెల్లజీలకఱ్ఱ, బాదంపప్పు ప్రత్తిపలుకులు, చల గోజాపప్పు, సోయికూరవిత్తులు, యివినీటితోనూరి రసముదీసి అర్ధశేరు ఆవుపాలలోజేర్చి అందు నిషిస్తా తు ౨ పటికిబెల్లము కొద్దిగావైచి పాకమొనరించి సుఖోష్ణముగా పానమొనరించ వలయును.

నిషిస్తాచేయువిధము:—గోధుమలు నీటిలోజేర్చి నాన బెట్టి రుబ్బి పాలుదీసి కళాయి పాత్రయందుగాని మట్టి పాత్రి యందుగాని జేర్చియెండబెట్టి పిండిజేయువలయును. దీనినే నిషిస్తాయందురు.

చనుకుమరుకు — మొదటిఅవస్థయందు ౯ మర్దనల నెట్రింఫాస్ ఫెరంఫాస్ వీనిపొడుముల రెండుగంటల కొకసారి గొనవలయును.

3 మర్దనల ఫెరంఫాస్ ౩౦ గ్రెయినులు వేడినీటిలో గలపి చన్నుకుదురులకు బూయవలయును. ఫెరంఫాస్ కాలీమూరు నొకదాని వెంట నొకటి యొసగినచన్నులు వాపునందు గలిగిన జ్వరము హరించును. జ్వరము లేనియెడల మర్దనల కాలీమూరు నొసగవలయును.

దుగ్ధజ్వరము—ఇది చికిత్సలేకయే మానును. మానకున్న ౯ మర్దనల ఫెరంఫాస్ రెండుగంటల కొకతూరి యివ్వవలయును.

స్తనములు పగిలినందుకు—తంగేడుయిగురు నూరి చనుబాలతోగాని నేతితోగాని స్తనములకు లేపనమొనరించ వలయును లేక వెన్నగాని పొంగించిన పటికిగాని మైనముగాని బూసిన చన్నుల గాయముల మానును.

బహిష్టునొప్పికి—మూడులేక ఆరుమర్దనల మ్యాగ్నిసియాఫాస్ యివి వేడినీటితో రెండు గంటలకొకసారి పానము చేయవలయును. ౯ మర్దనల ఫెరంఫాస్ గంటకొక పర్యాయ మొసగవలయును.

రజోరక్తము యుండలుగట్టి నల్లగా వెడలుచున్నందుకు ౬ మర్దనల కాలిమాగుచు రెండుగంటల కొకతూరి వాడవలయును.

రక్తస్రావమునకు—మిరియాలు, శొంఠి, బెల్లము వెల్లుల్లిరెబ్బలు కాకరాకులు యివినూరి మాత్రలు శేవించిన రక్తశూలలు హరించును.

గరప్రయోగము (పెట్టుమందు)—ముదిమ అవిశచెట్టు వేరు గంధముదీసి రొమ్మునందును కడుపుపైన బూసి సెగతో గాచిన అరకున్న యెడ పెట్టుమందు లక్షణమని గ్రహించవలయును. దీనియందు వమనము చేయించుట మంచిది. మ్రొంగపండ్లతోగాని చేనుబీరవిత్తులతోగాని వమనము చేయించవలయును కొందరు చిలుముతో జేయించుచుందురు యిదికష్టము.

గరోపద్రవహరచూర్ణము—వస, తుంగగడ్డలు, వాయువిడంగములు, చిత్రమూలలను, చాగగడ్డ, చేనుపొట్ల, ఏలకులు, చవ్యము, తిప్పతీగె, గ్రంధితగరము యివి సమములు చూర్ణమొనరించి నిమ్మపులుసుతో గాని మజ్జిగతో గాని త్రాగవలయును.

గర్భనాశనమునకు భిషక్సుధార్ణవం ఆ ౭

జలగల కషాయము పానమొనర్చినను జలగల మసి వెన్నతోగలపి మెక్కినను గర్భము ధరించనేరరు.

పసపు, గోపిచందనము యిది నిమ్మపులుసుతో బుచ్చు కొనినను తప్పుకాసరగడ్డ, కొబ్బరి యివి భక్షించినను గర్భము జారును.

డింగీజ్వరము (యిన్ ఫ్లూయెంజా)—కటుకరోహిణి వేపచెక్క, శొంఠి, ధనియాలు, తుంగగడ్డలు యివి కషాయముగాచి త్రాపవలయును.

క్వినైన్ సల్ఫేట్ ఆరతికర్పూరం వాడుట మంచిది.

భావనకరక్కాయ—కరక్కాయ చెక్కలు కలిలో వైచి పది దినములు ఊరబెట్టి కడిగి ఎండబెట్టి నాలవపాలు సైంధ లవణము జేర్చి పులిచల్లలో వైచి ఊరబెట్టి గైకొని ఒక కుండ లోబోసి పిప్పళ్ళు, చవ్యము, పిప్పలికట్టె, చిత్రమూలము యివి తులములవంతు జూచి ఓమము, మిర్యాలు, శొంఠి, జీలకర్ర, సింధులవణము యివి ఫలప్రమాణములు చూర్ణమొనరించి కుండలోనున్న కరకచెక్క గలపి అల్లపురసము, నిమ్మపులుసు, గుంటగల్గరరసము వీనితో ఊరబెట్టి సేవించిన దగ్గులు, జ్వరములు మందాగ్నులు పైత్యములు హరించును.

భావనజీలకర్ర—మంచి జీలకర్రలో సైంధలవణము జేర్చి నిమ్మపులుసుతో నానబెట్టి ఆరనిచ్చి మరల పులుసుతో దడపి యూరబెట్టి యిటుల నాలుగైదుసారులు భావనలొనరించి పిమ్మట అల్లపురసముతో నాలుగైదుసారులు భావనలొనరించ

వలయు నిది పుచ్చుకొనిన అరుచులు పైత్యములు దొలంగి ఆకలి గలుగును.

భావనఖర్జూరము—మంచి ఖర్జూరకాయలు చక్కలు జేసి విత్తనములు దీసివైచి సైంధలవణము కొద్దిగా జేర్చి నిమ్మ పులుసు, శొంఠి, రసములతో భావనలొనరించి సేవించిన గ్రహిణులు, పైత్యములు, ఉష్ణములు యివి అణగును.

భావనమరిచము—మిరియాలు కొంచము సైంధలవణము జేర్చి శంఖద్రావకముతో గాని మహాద్రావకముతో గాని నూరబెట్టుచున్నారు. మహాద్రావక మెక్కువమైన నోరు పుండగును.

జీరభక్షణ—అరచేతికి నీరు సున్నము బులిమి ఆరనిచ్చి పావుతులము జీలకర్రగాని బాగుగా నలచి వేడినీటితో పాన మొనరించిన పైత్యములణగి ఆకలిబుట్టును. ఉష్ణమణాగును. సోపును కూడా యీవిధిగానే భక్షించవచ్చును.

కడుపునొప్పి నరములు బిగబట్టినందులకు—తవిగుడ్డ బాగుగా పిండి నాలుగు మడతలుగా పొట్టపైబరచి వేడినీళ్ళు సీసాలోజేర్చి బాగుగా కార్కుబెట్టిగాని, చెంబులోవైచిగాని, నెమ్మదిగా కాచవలయును. ఉష్ణోదకము కాపడము సమస్త నొప్పులకు మంచిది.

పార్శ్వపునొప్పి (సూర్యావర్తము)—మంచి శొంఠిపొడుము బీల్చినను శొంఠిరసము కొద్దిగా నశ్యముజేసినను వావిలాకు పసరు నస్యమొనర్చినను హరించును.

పరమక్రియ—ఉదయము లేచుటతోడనే ఒక గ్లాసులో క్రిందటి దినము నీరుబోసి దానిలో కొంచము తేనెగలిపి పానము జేయవలెను.

బెణుకులకు—వెంటనే తడిగుడ్డజుట్టి నెత్తురు జేరకుండునటుల నాలుగు గంటలు తడుపుచుండవలయును. బాధ తీరకున్న వెన్నలో కొన్ని దినములు తోమించవలయును.

చిన్నబిడ్డ కామెర్లకు—యాలకులు, లవంగములు, దాల్చినిపట్ట వీని చూర్ణము పూటకు రెండు చిన్నములవంతున తేనెతో నొసగిన ౫ దినములకు కామిలలు హరించును. గిద్దెడు ఆవు పెరుగులో మూడుబొట్లు కాకరాకురసము బిండి మూడుపూట లివ్వవలయును.

అంగముచుండి రక్తముపడేవారికి—భూచక్రగడ్డ శతావరి వీని చూర్ణమునకు సమము చీనా చక్కెర గలపి యివ్వవలయును.

తంగేడాకు చూర్ణము పంచదారలో నొసంగిన గట్టును.

సుద్దకట్టుకు—పమిడిపత్తి, తెల్లపత్తి వీని వేళ్ళ రసము నూనె యివి డబ్బువంతున గూర్చి జీలకర్ర తులము గలపి ౫ దినము లోసంగిన కట్టును. పథ్యము అత్తెసరన్నము మంచి గేదెపెరుగు లేక చెరలు పుట్టలోని గడ్డ ఆవునేతిలో జేర్చి కాచి వడియగట్టి ౧౦ దినములు దినుపించిన మానును.

ఎలుకకాటుకు—కరచిన వెంటనే తాడుగాల్చి గాయ ముమీద చురుకిచ్చుట చాలామంచిది. ఈపని జేసిన వేరుగా నౌషధమక్కర లేదు. చిత్రివేళ్ళరసము త్రాగించిన సర్వవిష ములు హరించును. చిత్రికూర భక్షించవలయును. ఇది పులుసు కూరుగా జేసియే తినవలయును.

కండ్లమెరుపులకు—తుమ్మిఆకు అరచేతిలో బాగుగా నలచిపొట్టునంతయు బాగుగాములపికుంచము చనుబాలంతో రంగ రించి కన్నులలో బెట్టుకొనిన కన్నులమంటలు మెరుపులు మా నును. కలుబాదగుజ్జుముక్కలు బాగుగా నీళ్లతో బిసికి కడగి శు భ్రముజేసి తెల్లని గుడ్డలోవైచిపటకి పొడుముచల్లి పొట్లము గట్టి కన్నులపైనద్దుకొనిన మెరుపులుమాని మంటలణగును. నందివర్ధనపుష్పము లద్దుకొనవచ్చును. లవంగము ఖర్జూరపు వి త్తనము యివి తేనెతో రంగరించి కన్నులలో వైచుకొనిన పైత్యములు మంటలు హరించును.

చిన్నబిడ్డగుణము (పాలపాప)—ముందుగా కొంచము జ్వరమొదవి అందుబిడ్డలు చైతన్యముడిగి ఒడలుబిగుసుకపోవును. దీనిని వెంటనే గ్రహించి చికిత్సలొనరించకున్న అదియే దీర్ఘనిద్రియగును. మత్తుదెలపుటయే దీనికిచికిత్స. బిడ్డనెగరవేసి మత్తు దెలుపవలయును. జిల్లేడాకురసము ఒకబొట్టు ముక్కురంధ్రములలో పిండవలయును. నీరుల్లి నమలి ముక్కులలో నూదవలయును. వీనిలో నెద్దానిచేనైనను తెలివిలోనికివచ్చునట్లు జేయవలయును. దానియెడల చుట్టతోగాని పసపుకొమ్మునుగాల్చిగాని ముఖముందునను నుచ్చిలిగుంటవద్దనున్న వక్షము మీద సూక్ష్మముగా రక్షలు వేయవలయును.

ఉసికిలోను తలపైనను ముఖముపైనను బూయవచ్చును గుడ్డతడపి నూదుపై వేయవలయును. ఇది ఒకొకప్పుడు మరల మరల వచ్చుచుండును. అటురాకుండ కాపాడుటకు గోరోజనము (చప్పిడి) చనుబాలలోకలపి పోయుచుండవలయును. మంచి కస్తూరిమాత్రిల జట్టువరగురసముదీసి పొంగించి పానముజేయించవలయును. రక్షలేకుండా తెలివినిచ్చుటయే యింటివారి తెలవి. వెంటనే బలీయులు జాగ్రతగా నెగురవేసి బట్టుకొనవలయును.

దేహ కాంతికి—దానిమ్మవేరు పట్ట దిరిశన పువ్వులొద్దుగపట్ట వేపచెక్క పీటిచూర్ణముతో నలుగుబెట్టుకొనిన

తీటచిడుము మొదలగునవి హరించి గాత్రమునకు కాంతి గలుగును.

వదనదుర్గంధము (నోటికంపునకు)—జాజికాయ చంగల్వ కోష్టు లవంగములు జాపత్రి పిప్పళ్ళు యివి పొడిజేసి నోటిలో నేసికొనిన దుర్వాసనలు హరించును. మాదీఫలచర్మము తేనె యివి నమలిన నోటికంపులు హరియించును. ఏలకులు తుంగ గడ్డలు కొతిమెర్లు యష్టిమధుకము చంగల్వకోష్టు ఇవి చూర్ణ మొనరించి నోటియందు ధరియించిన నోటికంపులు హరియించును

సంగదోషములకు—జిల్లేడు వేరుచక్క తమ్మలపాకుతో భక్షణ జేయించవలయును.

సంగదోషములకు అంజనము—ఇంగువ జొన్నగింజలు మిరియము యివి కాకరాకు పసరున నూరి నల్లిపోతు నెత్తురు గలపి నేత్రములలో వేయవలయును. వివరము ఏస్త్రీవలన దోషముసంభవించినదో వారిలోడ రక్తము అంజనముగా నుపయోగించుటకలదు. భార్యలైన అభ్యంతరమునుండదు లేక అన్యస్త్రీలయిన కొన్నికష్టములవలన దుర్లభము మనుజరక్తము ప్రాధాన్యమగుటచే నల్లియందు మానుజరక్తముండును గాన దాని రక్తము చెప్పబడినది. ఇది పరమగోప్యమైన అంజనము. లోకోపకారముకొరకు దెలుపబడెను. ఏదిఅయినను మాంసు

దినములలోగా గ్రహించి తగుచికిత్సలు సలపిన దోషము తొలంగును. ముదిరిన బ్రహ్మకలవిగాదని నమ్మవలయును.

అన్నదోషమునకు అగడ్త పాయము—అన్నము వేప యిగురు ఆవాలు యివి పెంకులో జేర్చి మాడ్చి నీరుబోసి దించి వడియగట్టి పానముజేయించిన అన్నదోషములు హరించును.

స్త్రీల కుసుమములకు మంచిమందు.

కం॥ ఈరాడక్కా చూర్ణము
జేరిచి శర్కరకుసమము చెలులకొసంగన్
మీరక రక్తప్రదరము
లారును బెజవాడ పుర గృహాంతర ఖేలా॥

ధన్వంతరివైద్యలహరి.

తా॥ ఈరాడక్క (యీరాదుఖియా) దీని చూర్ణము పంచదారతో యొసగిన కుసుమములు హరించును. ఇది యూనాని ప్రక్రియ ఒకచోట్లు బాక.

యిక్షుమేహమునకు—సల్ఫర్ బిటర్సు (గంధక తాళముల ద్రావకము) ఒక తులము రెండు తులముల జలములో జేర్చి త్రాగవలెను. ఇచ్ఛాపథ్యము.

రాత్రిపూట అన్నము నీటిలోవైచి ఉదయం సేవించుచు మధ్యాహ్నము మజ్జిగలేకుండా భుజించుచు రాత్రిమినపగారెల

సేవించుచు ప్రాతఃకాలము స్నానము చేయుచుండిన యెడల మేహము నివారించును. ఇది అనుభవజ్ఞులు చెప్పిన ప్రక్రియ.

గారెలువండు పద్ధతి.—రుబ్బి సిద్ధమొనర్చిన మినప పిండిలో రెండు తులములు గొబ్బి వేళ్ళరసము జేర్చి బిసికి వండవలయును. ప్రాతఃకాలము స్నానమొనర్చిన పిమ్మట ఉన్ని వస్త్రము (కంబళి) కప్పుకొనవలయును.

కొయినా (క్వినీన్) మాత్రలుకట్టు పద్ధతి—అతిమధురంపాలు తు ౦ । పిప్పరమెంటుపువ్వు తు ౦ । కొయినా తు ౦ । యివి నూరి మాత్రలుగట్టి యొసగిన శీతజ్వరము హరించును.

నాసికా రక్తస్రావము (ముక్కు-బెనుగుట)—మేకపండ్లలో నెయ్యి పంచదార కలపి పక్వమొనర్చి ఏలకులు మిరియాల పొడుములు కలపి భక్షించిన నాసికరక్త స్రావము హరించును. నాసికారక్తమును లేసిగుడ్డముక్క రంధ్రములబెట్టి స్రావమాపవలయును.

తలనొప్పులకు—పంచదార పానకము (శర్కరసీటిలో జేర్చి) పానముజేసినను మునగాకు రసముతో మిరియముల మర్దించి ముఖము కణతలకు పట్టువైచినను తలనొప్పులు హరించును.

వెలగవేరు పట్టు—ముదురువెలగచెట్టు వేరు గంధము దీసి కణతలకు ముఖమునకు మాడున పట్టువేచిన పైత్యము వలన కలిగిన తలనొప్పులు తప్పక హరించును.

ఆవాలు పట్టు—ఆవాలు సానపైబోసి దూసరతీగె వేరుతో గంధముతీసి మాడుకు కణతలకు పట్టువేసిన వాతము వలన కలిగిన తలనొప్పులు హరించును.

బాలాజీర్ణములకు—ఉచ్చింతపూత జెముడు కొనలు వాకుడుపూత దట్టుపాకులు యివి నీటియావిరిచే యుడికించి రసముపిండుకొని కస్తూరిమాత్రలు వాడవలయును.

నులిపురుగుకు—నూగుకాయలు ఇవి వాముర సములో గాని, చనుబాలలో గాని, గలిపి త్రాగించ వలయును.

బాలాజీర్ణములకు—మంచపసపుకొమ్ము, సాంబ్రాణి, యింగువ, ఇవి చనుబాలతో గంధముతీసి త్రాగించిన ఆకుపచ్చ అజీర్ణ విరేచనములు, తెల్లని విరేచనములు, గట్టి యథాప్రకార మగును.

కలరాకు—పాటీర, పిప్పళ్ళు, మిరియాలు వాయు విడంగములు యివి సున్నపుతేటతో నూరి మాత్రలుగట్టి సున్నపుతేటతో నొసగ వలయును.

నాలుకపూతకు—ఏలకులు తు ౧, తవాషీరి తు ౧, రససింధూరం తు ౦౹ యివినూరి మీగడతో గాని వెన్నతో

గాని భక్షించవలయును. రససింధూరము తేనెతో సాది నాలుకకు పూయవలయును.

విడియము (ఆకుమడుపు)—సోయివిత్తులు, సోపు, లవంగములు, చలవమిరియాలు, జాజికాయలు, జాపత్రి, జీలకర్ర, సబ్జావిత్తులు, కేకవిత్తులు, నాగకేసరములు, కుంకుమపువ్వు, కస్తూరి ఏలకులు, గసగసాలు కలపి వక్కపొడిజేర్చి, యెండుకొబ్బరి తురుము వైచి, తమలపాకులకుదాచినఅరకు, కొద్దిగా సున్నము బూసి పైపొడిని తగుమాత్రమువైచి మడుపుజుట్టి లవంగము గుచ్చవలయును.

లఘువిడియము—లవంగాలు, కాచు, జీలకర్ర, ధనియాలు, సోపు, జాపత్రి, చలవమిరియాలు, ఏలకులు ఇవి వక్కపొడి సున్నము బూసిన ఆకులందుజేర్చి జుట్టి భక్షించవలయును.

సీ. జీరధనియాలు పోకలు జేర్చి కొద్ది
వెచ్చగావించి నాగవల్లీదళముల
విడెముసేయుదు రింతులు విశ్వమునను
నిగమనుతశైల చాపఫణీకలాప.

శ్రీ బాలవైద్యసుధాబ్ధి. పు 238.

శొంఠి—కుమ్ములో జేర్చి నెచ్చ జేసిన శుద్ధియగును.

మైలతుత్తము—పెరుగులో నూరి వేయించిన శుద్ధియగును.

నేపాళముల పప్పు—గోమయములో నుడికించిన శుద్ధియగును.

కం. జీవాధార పరాత్పర
భావాతీతాంతరాత్మ భక్తవిచారా
పావనశీల నిరామయ
దేవా విశ్వాత్మ విమలదివ్యచరిత్రా.



గద్య.

ఇయ్యది వైశ్యకుల పారావార రాకానిశాకర శత్రువర్గ భీకర
కౌండిన్యసగోత్ర పవిత్ర సుజనమిత్ర బసవయసుబ్బాం
బాప్రియపుత్ర కంకిపాటి తాతయార్య సర
మాంబాదుహితృ బంధుజనాప్త
వెంకటసుబ్బరాయగుప్త విరచిత
అనుభవ గృహవైద్య
గ్రంథమున తృతీయ
సోపానము.

సంపూర్ణము.





మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A102 B110 |
| పుస్తకం పేరు | వేనం భవిష్యవా విద్యాపీఠు |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 161 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI, b,44,80 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | nandhini |
| స్కాన్ చేసినది | pratyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |